# కవిపోషక మహాశయులు

1. శ్రీవిశ్వనాథరావుగారు. జమీందారు. రేచనీ తాండూరు.
2. శ్రీతిమ్మరాజు రామకిషన్‌రావు. (బాపు) కమానపూరము.
3. శ్రీరామచంద్రరావు పై కాజీగారు జమీందారు ఆసిఫాబాద్.
4. శ్రీగోవిందాచారిగారు, ప్ర.ఉ. ఉన్నతపాఠశాల. మంథెన.
5. శ్రీఆయతపోచిరెడ్డిగారు, దామరకుంట.
6. శ్రీగులకోట శ్రీరాములుగారు, M. L. A.

# కవి సహాయక సభ్యులు

1. శ్రీతిమ్మరాజు తిరుమల్‌రావు & శ్రీగోపాల్‌రావుగార్లు కమానపురము.
2. శ్రీ ఇనగంటి వెంకటేశ్వరరావుగారు, పో. పటేలు కమానపురము.
3. శ్రీ ,, రంగారావుగారు, మా పటేలు కమానపురము.
4. శ్రీ ,, సుధాకరరావుగారు, పో. పటేలు ,,
5. శ్రీకందాళ జగన్నాధాచార్య, డాక్టర్ ఆయుర్వేదిక్. ,,
6. శ్రీగోపాల్‌రావు దాజిగారు, తాండూరు.
7. శ్రీపురుషోత్తమరావుగారు. ,,
8. శ్రీబాపురావుగారు, వకీలు. ,,
9. శ్రీభీమరావు అండ్ (శ్రీ) రాజేశ్వరరావు గిర్దావరులు తాండూరు.
10. శ్రీవెంకటేశ్వరరావుగారు, పట్వారి తాండూరు.
11. శ్రీమిరిదొడ్డి రాజేశ్వరరావుగారు. ,,
12. శ్రీజగ్గయ్యగౌడు. ,,

# అక్కడక్కడ

## ఖండకావ్యము




రచయిత:

**సేనాపతి రామాచార్య,**

ఉపాధ్యాయుడు, ఉన్నతపాఠశాల, మంత్రకూటము (మంథెని)

(మనసా-పురుషార్థింపన్యులు-కర్తలు)

పరిష్కర్త:

**శ్రీవానమామలై లక్ష్మణాచార్యకవి**





మొదటికూర్పు. 1000 ప్రతులు.





ముద్రణ:

**శ్రీ రామా పవర్ ప్రెస్,**

1877-79 సాండర్స్ రోడ్, సికింద్రాబాద్-ద.

**1953**




వెల 1-0-0

సుహృదులకు 2-0-0

# కృతిసమర్పణ

అన్యోన్య ప్రణయానుకూల కవితా ◊ వ్యాసంగురాలైన మ
త్కన్యా కావ్యలతా మనోహారిని నీకై వేణుగోపాల రా
జన్యా! పంపితిఁగాన- నీవరదహ ◊ స్తాంభోరుహాగ్రతం
కన్యాదానఫలంబు నాకొసఁగుమా ◊ కర్తవ్యధర్మంబనన్.

## మనవి

1. శ్రీ వానమామలై లక్ష్మణాచార్యులుగారు (అనుసూయ తెనుఁగుకావ్యకర్తలు-శిక్ష-వ్యాకరణగ్రంధకర్తలు-సావిత్రియిత్యాదిసంస్కృతనాటకకర్తలు-గాని ధనాభావముచే నవి ప్రకటింపఁబడలేదు) నా కావ్యమును నామూలాగ్రముగాఁ జూచి సహాయ సౌహార్ద ప్రదర్శనముఁ జేసినందులకు భక్తిపురస్సర శతప్రణామ పుష్పాంజలి.

2. శ్రీ ఇమ్మడి రాజయ్యగారు (Dy. Inspector of Schools, Chennoor) నాకు బాల్యములోఁ జదువుఁగఱపిన వారు, పితృతుల్యులు. వారి ప్రోత్సాహ ప్రాబల్య పరిణామ ఫలమే యేతత్కావ్య ఫలము-గాన వారికి భక్తి పురస్సరశత ప్రణామ పుష్పాంజలి.

3. మంత్రి కూటములోని నారస్వతాభిమాన జనకోటికి మకుట సమానులగు శ్రీ వెంకట రాజన్న అవధాని వకీలుగారు నాకు సహాయకులు - చిన్నకవులను జేరఁదీసి ప్రోత్సాహ పఱచునట్టి వీరి ఉదార శీలమునకు మత్ప్రప్రథమాభివందనములు.

4. "పురుషార్థం మన్యులు"-శతకము డబ్బులేక ప్రకటించ లేక పోయినవాఁడ-కొన్ని శీర్షికలు-ఇందులోఁ జేర్చితిని.

సేనాపతి

# అభిప్రాయములు

1. పద్యములు చాల యింపుగా నున్నవి. శైలి సులభగ్రాహ్యముగాఁ గన వచ్చినది. యతి ప్రాసములు సుభగతి ఆనందము గొల్పినవి. కవి చాడప్పను గురించిన పద్యములు మరల మరల చదివినాను.

(Sd.) శ్రీ. మాడపాటి హనుమంతురావుగారు.
ఆంధ్రకుటీరము. సుల్తాను బజారు. హైదరాబాదు-ద.

2 "అక్కడక్కడ" అను కావ్యమును జదివితిని. వీరిభావములు కొన్ని నవ్యములు. విషయములు ఆకర్షణీయములు. శైలిబాగుగానున్నది. వీరికవిత్వము ఆంధ్రజాతికిని నాదరణీయముగా నుండవలెనని కోరుదును.

(Sd.) సురవరపు ప్రతాపరెడ్డిగారు. B. A. B. L., M. L. A.
సంపత్తి భవనము. తులజాగూడ హైదరాబాదు-ద.

3 "అక్కడక్కడ" అంతా చదివినాను. జీవన ప్రస్థానములో అక్కడక్కడ మజిలీలు చేస్తూపోయినట్లు వుంటుంది. చదువుతున్నంతసేపు కవిత్వము మజిలీలలానే వుండాలి. అప్పుడే విశ్రాంతిచే కూరిఆహ్లాదైకమయం ఆవుతుంది. ఈయన పద్యం నడపడంలో చాలా చమక్కులు చూపుతాడు. ఉదాహరణకు "ఇలవేల్పుతలంపు"లోని మొదటి పద్యంలోని మూడవపంక్తి "ఆరంభించితిని. బరువుభారము" చదువుతే బరువుగా ఉంటుంది. నగణంలో ఒక అక్షరముపైకి తన్నేసి ఫుల్‌స్టాఫ్ అతికించాడు. ఇదినాకు చాలనచ్చింది. "వెనుకంబడిన తెలంగాణ వీథులందు" ఇట్టి కవిసత్తము ప్రభవిస్తు వుండడం ఉజ్జ్వలమైన ఆగామికి సుప్రభాతము వంటిది.

(Sd.) శ్రీ దాశరథి కవిసమ్రాట్టు.

4. "అక్కడక్కడ"యను పేరుగల ఖండకావ్యముల సంపుటిని కొంత కొంతఁ జూచితిని. ఈ కవికి చక్కని భావనాశక్తిగలదు. కవి హృదయము విద్యుత్కిరణము వంటిది. స్పృశించిన దాని నెల్ల విద్యున్మయము చేయుశక్తి దానికిగలదు. కవి హృదయము తాను ప్రసరించిన వస్తువుపై ఒక్కుమ్మడి క్షీరధారలు గ్రుమ్మరించును. జీవనపు రొంపిలోఁబడిన సామాన్యవ్యక్తికి సుంధర

వస్తువుగూడ ఉపేక్షణీయముగానే దోచును. సౌందర్యభావముగల కవికి గడ్డిపోచకూడ మహద్వస్తువుగా భాసించును. సేనాపతి రామాచార్య కవిగారికి ఇట్టి నిత్యకల్యాణమైన భావనగలదనుట ముదావహము. కాని వీరి శబ్దపుష్టి భావపుష్టికి ఈడగుటలేదు. నిరంతర కావ్యానుశీలనముచే వీరీలోపమును పూరించుకొందురని ఆశించుచున్నాను.

(Sd.) ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము.

(Head of the Telugu Department,
Osmania University.)

5. శ్రీ సేనాపతి రామాచార్యులలో కవికి ఉండవలసిన ఆవేశము ఉన్నది. నిండు హృదయమూ ఉన్నది. ఇవి రెండుగల వానికవిత్వము రసము తప్పక చిప్పిల్లును.

ఒకే మకుటముతోడ పద్యాలు శతకములందు దప్ప కావ్యములం దరిది. "మనసా! వద్దిక నాదుమాట వినుమా! మర్యాదగా పోదుమా" అను మకుటముతో శ్రీ తిరుపతి వెంకటేశ్వర కవులు శ్రవణానంద కావ్యములో వ్రాసిన పద్యాలున్నవి. ఒకే మకుటముతో వ్రాసిన పద్యాలలో ఏదో క్రొత్తదన ముగపడి చదువుటకూ వినుటకూ ఇంపుగా ఉంటావి. వీరు రకరకముల శీర్షికల క్రింద ఒక్కొక్క మకుటముతో కొన్నికొన్ని పద్యాలు వ్రాయుట క్రొత్తలో క్రొత్త. రచన అన్నప్పుడు గుణాలు దోషాలు రెండు ఉంటావి. రసగ్రహణ పారీణదృష్టి దోషముల నన్వేషింపదు. అక్కడక్కడలో అక్కడక్కడ కొన్ని పద్యాలు కవివర్యుని భావాన్ని స్పష్టపఱచుటలో అసమర్థములైనవి.

నేడు రేపు పెద్దపెద్ద పొత్తాలు చదివే ఓపిక ఎవరికీలేదు. కాన అందఱికి చదువ వీలగునట్లు ఖండకావ్య రచన బయలు దేరినది. ఇది ఇంకను నవీన ఖండకావ్యము. "సద్యః పరనిర్వృత్తయే" కావ్యమునకు ప్రయోజనము వినువారానందపడుట. అది సమకూరు నప్పుడు, ఖండకావ్యమైతే ఏమి? గద్యపద్యమైతే ఏమి? ఈ కవి అనేక గ్రంథ ప్రణేతయగునట్లు భగవంతుడను గ్రహించుగాక.

(Sd.) శ్రీగార్లపాటి రాఘవరెడ్డిగారు, కవి. ఓరుగల్లు

6. శ్రీ మిక్కిలి యుత్సాహ పూరితులైన కవియువకులు. వీరికవనము రసభరితమై, ధారాళమైన ధారచే శోభించుచుండును. ప్రతి పద్యములో నొక నవ్యత మరియు భావవైచిత్ర్యము స్ఫురించుచుండును. పవిత్ర శీర్షికలో హృదయంగమములైన పద్యములు కొన్ని గలవు. కొన్ని శీర్షికలు - ఏక మకుటముగా వ్రాయబడినవి. అవి కవి వాక్చాతుర్యమును మరియు భావగాంభీర్యమును జాటుచున్నవి. కొన్ని సందర్భములలో నికవి స్వేచ్ఛను నవలంబించి లౌకిక భాషాపదముల బ్రయోగించినను నవి యంతయు కర్ణకఠోరము గాక హృదయరంజకముగానే యున్నవి.

(Sd.) శ్రీ ఉదయరాజు శేషగిరిరావు.

ఎం. ఏ. రాజకవి చూడామణి. ఉపా. ఉన్నతపాఠశాల. అనుమకొండ.

7. ఈ ఏక ఖండకావ్యమును సర్వాంగ సుందరముగా సృష్టించుటలో యీకవి అఖండ తపః కృషి జేసినాడన్న తప్పుకాదు. భావమధురము, భావములు పవిత్రములు, గంభీరములు, ధ్వని ప్రధానములు; శైలిసుందరము, కోమలము. వాడిన జాతీయములు ఆయారసప్రవృత్తులకు మెరుగులు దిద్ది అందములు గూర్చినవి. ఈవిశ్వవీథులలో అక్కడక్కడి యనుభవ ఘట్టములు అక్కడక్కడే విచిత్రముగా చిత్రింపబడి యుండుటచే యీకావ్యకన్యకు "అక్కడక్కడ" యను నామకరణము సార్థకమనియే యనవచ్చును. నవ్యాంధ్ర సారస్వత కావ్యమణి మాలలో యీకవి గూర్చిన "అక్కడక్కడ" అనుపద్య రత్నమాల ఆంధ్ర భాషాయోషి సీమంతమలంకరించు గాతయని నాయభినందనములు.

(Sd.) శ్రీ వానమామలై జగన్నాథాచారి, కవి.

బాలికాపాఠశాల, కాలువ శ్రీరామపురము.

8. సరళశైలిలో హృద్యములగు నూతన భావములుగల ఈ ఖండకావ్య సంపుటి శ్రీ సేనాపతిగారి ప్రథమ ప్రయత్నము. ఇందు కొన్ని పద్యములు వ్యావహారిక భాషా పదప్రయుక్తములై నవ్యసమాసములును, కొన్నిచోట్ల నన్వయక్లిష్టతయు గలిగి నూతన మార్గమున విరాజిల్లుచున్నవి. వీరి విమర్శనాదృష్టిని, నైపుణ్యమును, భావగాంభీర్యమును, సంఘసంస్క-

రణ ప్రియత్వమును చాటుచున్నవి. మొత్తము మీద వీరినడక గతాను గతికములుగాక రస విహీనములగు కావ్యములను నిరసించుచు నొక నూతన మార్గమును త్రొక్కుచున్నది.

(Sd.) శ్రీఇమ్మడి రాజయ్య,
ప్రా. పా. శాల. నిరీక్షకుడు, చెన్నూరు.

9. బాలకవియగు శ్రీ సేనాపతిగారి "అక్కడక్కడను" అక్కడక్కడనే చూడగలిగితిని. ఈ ఖండ కావ్యమునందు కొన్ని మధుఖండముల త్యంత రామణీయములై పండితులతోసహా పామరులనుగూడ సమాన భాగస్వాములుగాఁ జేయుచున్నవి. వీరి కవిత భక్తి కరుణారస ప్రధానము.

(Sd.) శ్రీ గంగా రాజేశ్వరరావు. B. A. B. Ed.
ఉపా॥ ఉన్నతపాఠశాల, మంత్రికూటము.

10. అక్కడక్కడలోని భావములు హృదయంగమములుగానున్నవి. శైలియు సరళము. వివిధ శీర్షికలతో నియ్యది పలుతీరుల పూలమొక్కలతో గనుల పండువు సేయు పూలతోటవలె నింపెసలారుచున్నది. వ్యుత్పత్త్యభ్యాసము లింకను బెంపొంది సహజమైన యీకవి ప్రతిభకు వన్నె దెచ్చుననియు నీ యుత్సాహిరస వత్తరములైనకొంగ్రొత్తకబ్బపుందొడవులతో దెనుగు తల్లి నిత్యాధికముగా సేవించు సదవకాశము నొందుననియు సాశించుచున్నాను.

(Sd.) శ్రీ చెలమచెర్ల రంగాచార్యులు,
ఆంధ్ర సంస్కృతోపన్యాసకులు, కళాశాల, వరంగల్లు.



# తొలిపలుకులు

గేయములు రాజకీయముగా వ్రాయుఫక్కి ఒకటి కలదు. కాని, యీకవి మహాశయుని రచన నూతన ఫక్కిని నాశ్రయించి, నవసుందర కోమల భావసంపదచే, లోకోక్తులు గ్రామ్యశబ్ద ప్రయోగములు గలిగి క్రొంగ్రొత్తలగు భావ వికాసములను సుమనస్సుల విరజిల్లుచు, విశేష ప్రతిభాప్రభా వంతములగు పద్యరత్నములచే, విరాజిల్లుచున్నది.

వీరి కవితాశబ్ద వైఖరి పూర్వరూపమును నాశ్రయించి నను అక్కడక్కడ భావగాంభీర్యము చాల అపురూపముగా నుండును. ఏకమకుటముఁగల శీర్షికలలో అమూల్య భావ వైచిత్ర్యము వెలిబుచ్చి యున్నారు. కొన్నిమహారాష్ట్రభాషా సాంప్రదాయ శబ్దములఁ బ్రకటించుచుందురు.

"కవితా సామ్రాజ్యము, రాజకవులు-కవులపై కోపము కవిదృష్టి రవిదృష్టి"...ఇత్యాది శీర్షికలలో వీరికి కవులపై కవితపై నెంతటి ఆదరాభిమానము కలదో పాఠకులు గ్రహింతురుగాక. 'మాలలుపుష్పమాలలు-మాలరాజ్యము దౌర్భాగ్య రేఖలు' ఇత్యాది శీర్షికలలో దీనోద్ధరణ దీక్షస్పష్టమగును. అది ఇది యననేల? సకల విషయములందును వీరు సర్వతోముఖ విమర్శనఁ జేయుచు లోకమును నీతి విజ్ఞానము రసమును ప్రదానముఁ జేయుచుందురు. దీనికై నా "అనసూయ" కావ్యములోని యీ పద్యము సర్వథాసార్థకము.

గీ॥ కవి పరబ్రహ్మ కావ్య లోకాలఁదమినిఁ
బ్రత్యణువున వ్యాపించి లోఁబయటఁ గూడ
ధర్మ విజ్ఞాన రససృష్టిఁ దనరు లీలఁ
దాన సర్వమై యక్షర త్వాన మెఱయు॥

జిలిబిలి ముద్దులొలుకుజాను తెనుఁగు పదముల నుడికారపు సొంపు అచ్ఛసంస్కృత పదగుంభనము, తేనె సోనలు గురియుశైలి, హృదయంగమ లోకోక్తులు, భావప్రవాహము నకు నడ్డుదగలని వశ్యవచస్కత కొ్రత్తదనములోని మెత్తఁదనము, గ్రామ్య భాషాభూయిష్ఠత, కొన్ని ప్రదేశముల లోనన్వయక్లిష్టతమున్నగునవి కలవు. వీరి రచనా విశేషము మంటె ద్రోణాచార్యుల వలన ధనుర్విద్యాభ్యాసము వంటిది.

వీరి ప్రయోగములు కేవలము లౌకికములు. మొత్తము పై వీరి రచనలో నొక నూతన చైతన్యము వెల్లివిరియుచున్నది. వ్యవహార భాషాగత ప్రయోగముల కెంతో ప్రాశస్త్యము కల్పించెదరు. పోతనగారి "వస్తాడా పోతాడా" యన్నట్లు అక్కడక్కడ ప్రయోగములు గన్పడ పాఠకులు గ్రహింతురు. వ్యాకరణ వైశాల్యాపేక్ష వీరిలోఁ దొణకిసలాడుచుండును. కవిభక్తుఁడైన యీకవీశునకు పరమేశ్వరుఁడు రచనా విశేషశక్తిని, ఆయురారోగ్య భాగ్యములను బ్రసాదింపుఁగాక. వీరి కృతి చిరకీర్తి నార్జించుఁగాక.

(Sd.) శ్రీవాసమామల్లై లక్ష్మణాచార్యులు. కవి.
ఉపాధ్యాయుఁడు బాలికాపాఠశాల,
శ్రీరామపురము. (కరీమనగరము మండలము)

# విషయానుక్రమణిక



# సవరణ పట్టిక

## పాఠకులకు వినయపూర్వకమైన మనవి

1 దయ జేసి తప్పులను దిద్దుకొనిన పిదప చదువవలెను.

1 ప్రథమ భాగములోని 6-14-15-17-19-21-22-25-27-29-36 శీర్షికలు మఱియు ద్వితీయభాగములోని 1-2-5న్ను ఏకముకుట పద్యములని భావించవలెను.

3 ప్రథమ భాగములోని 8-12-18-23-25 శీర్షికలు ద్వితీయభాగములోని శీర్షికలని భావించవలయునని ప్రార్థన.

సేనాపతి.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 5 | 6 | ..................... | Drop గొంతి |
| 6 | 13 | దత్తుఁడన్నట్టి.........రామ | దత్తుఁడైట్టి జ్యేష్ఠపుత్రాభినామ |
| 9 | 10 | రక్కసలకు | రక్కసులకు |
| 11 | 20 | మనమునన్ | నవరస నిధాన కావ్యవనమునన్ |
| 16 | 14 | వదరెడిచోమీ | వదరినచోమీ |
| 24 | 8 | కవు౹ కలసు? | కవులు కలర? |
| 25 | 1 | భవసాగర | కలికాలములో స్వర్గము |
| 26 | 12 | గ్వసననునకు | గ్వ్యసనమునకు |
| 28 | 4 | దళితకులకోటి | దలిత కుల కోటిపయిన్ |
| 36 | 7 | కన్న కొడుకేగాని | కన్న కొడుకెగాని |
| " | 13 | అత | అంత నాయాసపడుచుండినట్టివేళ |
| 40 | 6 | నటుంచుదలంచి | నటుంచుఁదలఁచి |
| 42 | 6 | ..................... | లోచన చేయరాదు |
| 42 | 7 | ..................... | గుదిరించుట రాదయెుఁగాన బీదవా |
| " | 11 | గలిగివిధి | గలిగిన విధి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 45 | 18 | నెత్తును | నెత్తునను |
| 49 | 16 | భా॰ తీయులను | భారతీయజన-మేళ ముఖమ్ము వనుండు నీకలిగె |
| 54 | 1 | బడిపిల్లడ | బడిపిల్లడ! |
| 55 | 9 | ధురంధరులౌట | ధురంధరులేటు |
| 5? | 16 | బోదదియ | బోదిది యథార్థము |
| 58 | 16 | నమ్మెను గుర్చి | నమ్మెను గూర్చి |
| ,, | 18 | శ్యమ్మను | శ్యమ్మన |
| 61 | 13 | వినవారు | వినువారు |
| 62 | 8 | మిమ్మెగత | మిమ్మిగత |
| ,, | 12 | ద్దైవప్రాణికి | దైవ వాణికి |
| 63 | 8 | ఇక మోయవ | ఇక మోయవ! |
| 64 | 5 | పాబఫలంబు | పాప ఫలంబు |
| 69 | 11 | చంణాలులుగా | చండాలులుగా |
| 70 | 6 | పకృతివిశాల | ప్రకృతివిశాల |
| 7? | 18 | సామ్యధర్మ | సామ్యధర్మ |
| 71 | 8 | జిచివేసిన | జించివేసిన |
| ,, | 9 | గట్టిశిలలు | గట్టిశిలల |
| 79 | 15 | బడియున్న నోట | బడియన్న నో ఒక |
| 80 | 2 | గిట్టుబెట్టుకొని | ఒట్టుబెట్టుకొని |
| 8? | 18 | నాగరులోయన | నాగరికులోయన |
| 81 | 9 | సౌకార్యాలుండక | సౌకర్యాలుండక |



శ్రీరస్తు

# అక్కడక్కడ

## ఖండకావ్యము

(మొదటి భాగము)



## ఇలవేల్పు తలంపు

శ్రీరామా! నీవే నా
ప్రారబ్ధంబంచు నమ్మి • పద్యరచన నే
నారంభించితిని. బరువు
భారము నీపైన నునిచి • పరిపరిధమమునన్ ॥ 1

ఇనకుల రామచంద్ర! జగ • దేక శుభప్రదనామ! నీకుఁ జం
ద్రునకొక నూలుపోగాయనఁ•దోపఁ గవి ప్రతిభా ప్రశాంత నం
దనవన కోకిలంబన, స•దా వినయాన్విత శాశ్వతాభి వం
దన సుమనస్సులం బనిచె•దన్ మధురస్వర గీతి తోడుతన్ ॥2

ననుఁ గవిగా నొనర్చిన ఋ•ణమ్మునకో రఘురామభద్ర! నే
వినయ విధిజ్ఞత న్నవ న•వీన విచార సముద్ర రత్నరా
శిని భవదీయ పాదసర • సీరుహ సీమకుపాయ నమ్మనం
బనుచుచున్నందు. నేఁడుడుల•భక్తి పునశ్చరణమ్ముఁ జేయుచున్ ॥3

# కన్యాదానపుష్పాంజలి

మును గోవర్ధనమునుఁ జిటి
కెనవ్రేలున లేపినట్టి ♦ గిరిధర! యావ
న్మనమున నిను వలచిన యీ
ప్రణయినిఁ జేఁబట్ట లేని? ♦ వాఁడవయెద నే? ॥ 1

వనితా వనమున వక్రాం
గనయనఁ దగుకుబ్జనైనఁ ♦ గరుణారస సే
చనమునఁగఁ గటాక్షించిన
ఘనుఁడా! కాలాంతరానఁ ♦ గలిమహిమమునన్॥ 2

తెనుఁగునఁ దేనెలకనుఁ దీ
పినిఁ దెలిపెడి వాఙ్మయమున ♦ వినమిత కవితా
ధనమగు మత్ప్రథమ కృతినిఁ
గనుఁగొనవే? బీదవాని ♦ కానుకయనుచున్॥ 3

అనుభవ పండితుఁడగు తి
క్కనచేఁ గృతి రాజ కన్య ♦ కలనుఁ గొనిన నీ
ఘనతకుఁ గొదవనెదవ? స
త్కనియగు మత్కావ్యగోపి ♦ కనుఁగనుఁగొనిన్॥ 4

మునిజన సింహతుల్య కవి ♦ పుంగవుఁడై చనుదెంచినట్టి పో
తనకవితా కృతిఁగొనిన ♦ దానికి నాఁడు వరాహ మూర్తివై
అనితర రక్షకవ్రత ః♦యామక సార్థక లోకబాంధవా!
కనుఁగొనవచ్చు మత్ప్రథమ ♦ కావ్యసరశ్వత పత్రి నమ్రతన్ ॥ 5

# వందనపుష్పాంజలి

---

కోరక యుండినం బ్రజల ♦ కోసర మక్కఱలన్ని రీతులం
దీరును గాని నీ మఱల ♦ "దేహి" యనన్ విపరీతమైన ఓ
గారడమౌను, యజ్ఞమున ♦ గంటెడు నేతికి నైంద్రసంపదం
గోరిన నిత్తువా? మనుజ ♦ కోటి దురాశకు లోత? ఈశ్వరా!॥ 1

సనకసనందనాది ముని ♦ చంద్రమ కోటినిఁ ద్యాగరాజ పో
తన మొదలైన జ్యోతులను ♦ దంపుకు దంపనుఁజుట్టు ప్రక్కలం
గొనిన యశోవిశాల! కవి ♦ కోటి యకించన బృందమైన చోఁ
గనుఁగొనరాద? తోడ్పడిన ♦ గౌరవభంగము గాఁ దలంతువా!॥ 2

వనమాలీ! గుడిగోపుర
మునకు విరాళములనిచ్చు ♦ పుణ్యము నా కొం
గున లేని వాఁడ నీకై
పనిచెదఁ, గవితానినామ ♦ ఫలపుష్పములన్॥ 3

కారకులౌచు సర్వసహ ♦ కౌర విచార పరంపరా విధిన్
వారికి వీరు వీరలకు ♦ వారు సహాయముఁ జేయునట్టి వ్యా
పారకృషి ప్రధానధన ♦ వంతులు సైతము జేతులెత్తి నిం
గోరిన నిత్తువా? చిదుకు ♦ కొందువ? నవ్వేదవా? పరాత్పరా!॥ 4

—( * )—

# స్వకీయము

సేనాపతి సౌభాగ్యం
బీనాఁడు ఫలించెననుచు ♦ నెంతో పంచ
ప్రాణ సఖులుగా నన్నభి
మానించిన కవుల నే న♦మన మొనరింతున్॥ 1

కులమున శ్రీవైష్ణవుఁడని
యులికి పడుటకన్న హైంద♦వుండని తెలుపం
బలుసార్లు వల్లకెక్కినఁ
గలిగెడి సంతృప్తి నాకుఁ ♦ గలుగుచు నుండున్॥ 2

ఆర్యుఁడనై, పవిత్రతర ♦ హైందవ సంస్కృతి భాగ్యమంది, ఆ
చార్యక వృత్తినంది, బహు ♦ జన్మతపః ఫలరాశి చేత నే
ధైర్యముఁజేసి, ఆంధ్రకవి♦తాంబ! నినుంగొనుచుందు నీమహా
దార్య గుణానుపేత సుకృ♦తంబునునాకయి కొంతఁ బంచినన్॥ 3

తెనుఁగు దిబ్బన్ విశాలాంధ్ర ♦ దేశమందు,
వెనుకఁబడిన తెలంగాణ ♦ వీధులందు,
రాముఁడేలినదండకా ♦ రణ్య మందు,
ఆదిలాబాదు, మూలకో♦వేది యందు
సామజంబగు "చెన్నూరు"♦గ్రామమందు॥ 4

కోటి పూర్వజన్మ సుకృత ♦ కోటి నేఁడు
ఫలితమైనట్లు ప్రకట స♦త్ఫలము లనఁగ
ఆంధ్రజన్మ సౌభాగ్యంబు ♦ నందినాను
పంతు లగునట్టి భాగ్యంబు ♦ వడసినాను
తెలుఁగు కవన సంపదలఁ దేఁ ♦ గలిగినాను
శిష్ట సత్సంతానముం గాంతఁ ♦ జెందినాను॥ 5

సృష్టి రాధా రహస్యాలఁ ♦ జెప్పుచుండు;
సృష్టి ధారా నియమ కాండఁ ♦ జెప్పుచుండు
సృష్టి లీలా వినోదాలఁ ♦ జెప్పుచుండు
సృష్టికిన్ భావనా సృష్టిఁ ♦ జెప్పుచుండు॥ 6

కలిమి యిదే యనఁదగు నా
నలుగురు తమ్ములకు సాధ♦న ప్రతిమలనన్
నలుఁగురు సౌభాగ్యవతులు
తిలకములయి రెల్లరుఁ ♦ బతి వ్రతలగుచున్॥ 7

కని పెంచిన వారగు నా
యనుజులు కర్తవ్యశూరు♦లై చదువరులై
ధనికులయిరి ఔనన స
జ్జనులనఁబడ నెంత యేని♦సంతోషింతున్॥ 8

కవికిఁ గావల్సినట్టిల♦క్షణములన్ని
పూర్తిఁ జేసితిఁ జందాలఁ♦బోగుఁ జేసి,
"అక్కడక్కడ" ఖండ కా♦వ్యమును నేఁటి
కచ్చు వేయించఁ గలిగినా♦నప్పుఁ జేసి॥ 9

“నానా కృష్ణా” యని నే
వేనోటం గొడుకునట్లు ♦ బిలిచిన చో “నో
నానా! ననుఁ గని పెంచిన
నానా!” నిను స్మరణఁ జేసి ♦ నానని దలఁతున్॥ 10

“అమ్మక్కా” యని యనఁబడు
అమ్మా! నిను నింట బయట ♦ “అక్కా” యని నీ
కొమ్మలు బిలిచిన నాళ్ళ
ర్యమ్మయ్యును అమ్మ-అక్క ♦ యని బిలువఁబడన్॥ 11

తమ్ముఁడయి రంగనాథ నా ♦ మమ్ముకొలఁది
నిండుకుండఁగా గంభీర ♦ నిష్టుఁడయ్యె
భోజరాజుగా హోదాకు ♦ నాజరయ్యె
నేడ-తల్లి దండ్రుల పేరు ♦ నిలుపుచుండె॥ 12

దత్తడన్గట్టి జ్యేష్ఠ పు ♦ త్రాభిరామ
ధనము మాహోరు దత్తుచే ♦ దత్తమయ్యె
అత్తపుత్త మాటలచేత ♦ నాడుబిడ్డ
పేర ననసూయగా నింటఁ ♦ జేరియుండె॥ 13



# కందకోటి

---

కొందఱు నేటునకు మఱియుఁ
గొందఱు చాటునకునై న♦గొణిగి పిదప న
న్నిందించుచుందురో? మ
త్కంద విశేషాంగ ఖండ♦కావ్య రచనకై॥ 1

పందెమ్మాడిన సొగుస?
అందఱికిం జూడ నెంతో♦యందమున కదో
చందమ్మైన సురుచిరతర
కంద విశిష్టాంగ దివ్య♦కావ్య రచనకున్॥ 2

కంద కవన సంపదయే
కొందఱికే యబ్బివచ్చుఁ♦గోటి కొకరికిన్
నందునకు నితఃపరులయి
చెందుదురే? బాలకృష్ణ♦సింహా ప్రాప్తిన్॥ 3

వివిధాలంకార ప్రియ
యువతులకై కొప్పు మెప్పు♦లుండిన రీతిన్
వివిధాలంకార ప్రియు
కవులకుఁ గడు మెప్పు కంద♦ఖండంబనినన్॥ 4

నందన వనమున పాదప
బృందమ్మొక చిటికలోనఁ♦బెరుగని రీతిం
దొందర పడఁ గొనసాగదు
గందరగోళంపు కఠిన ♦ కంద రచనకున్॥ 5

# అలిపిరి ప్రాణులు

నలినీదళ మందలమును
దులదూగెడి బొమలు గలుగు♦వారసానులు గుం
డెల వడకునట్లు జేతురు.
పులులన్ మీసాలు బట్టి♦మొత్తిన దొరలన్॥ 1

కలహంస గమనమును గల
చెలువలు కోపపు మొగాన♦సింహపు దృష్టిం
జలిచెమటలు బుట్టింతురు.
పులులన్ మీసాలుబట్టి♦మొత్తిన దొరలన్॥ 2

జలరుహ నయన ద్వయమును
గలిగిన యలిపిరలు తృప్త♦కాములగుటకుం
గొలికి ముడియనం గొనెదరు.
పులులన్ మీసాలుబట్టి♦మొత్తెడి దొరలన్॥ 3

అలుకల కై తావలమై
కలహ ప్రియులగుచు బెద్ద♦గారడివారై
తలక్రిందులు గావింతురు
పులులన్ మీసాలబట్టి♦మొత్తెడి దొరలన్॥ 4

జిలిబిలి పలుకుల కలవడి
నెలతుకలకు నేటికేని ♦ నిమిషార్థమునన్
దలలెగురం గొట్ట వచ్చును
పులులన్ మీసాలుబట్టి ♦ మొత్తిన దొరలన్॥ 5

అలిపిరలై చూపునఁ గో
మలకుల తిలకములు మంద♦మధు వచనమునం
దలఁగొరిగి పంపుచుందురు
పులులన్ మీసాలుబట్టి♦మొత్తిన దొరలన్॥ 6

కలలందలి పులికి నులికి
నిలువున నీరైన లేత♦నెలఁతుకలు బలే
బలెయన నెగిరింతురు బె
బ్బులులన్ మీసాలుబట్టి ♦ మొత్తెడి దొరలన్॥ 7

కలిలో నవసరము కొలఁది
ప్రిశయముఁ దేఁగలుఁగుసట్టి ♦ రక్కసులకు బె
బ్బులులగుచు నేల వచ్చును.
పులులన్ మీసాలుఁబట్టి ♦ మొత్తినదొరలన్॥ 8

నగలకు నాణెములకుఁ దల
సిగలకుఁ బ్రాణములనిచ్చు ♦ చెలువలకు నెగా
దిగఁ జేసి తీరవచ్చును.
మగలన్ మగవారికేని ♦ మగలగు రీతిన్॥ 9

సన్న్యాసాశ్రమ వృద్ధ తాపసులపై ♦ సంసార సామ్రాజ్యరా
జన్యశ్రీం గురిపింప వచ్చుఁ బిదపన్ ♦ సౌజన్య సంసారులన్
సన్న్యాసంబునఁ బంప వీల్పడును వే♦శ్యాలోక రత్నాలకున్
అన్యోన్య ప్రణయంబుచే నభినయ ♦ వ్యాపార పారీణతన్॥10



# కవితా సామ్రాజ్యము

భూలోకైక మహేంద్రజాలమన నీ ♦ భూతాత్మగాథాశతిం
గాలున్ వ్రేలునుఁ బట్టియీడ్చి తుదకు♦ద్గ్రంథ పరిమాణస్థిరం
జాలుం బెట్టుటవచ్చు దివ్యకవితా♦సామ్రాజ్య సావిత్రికిన్
లీలాకావ్య వినోద భావగరిమన్ ♦ లేఖాప్రవేశంబునన్. 1

ఎండకు మలమల మాడుచు
నుండెడి గ్రీష్మముననైన ♦ నుత్తమ కవితా
భండార వసంత మధుర
ఖండము నిగనిగల నాడుఁ♦ గావ్య వనమునన్॥ 2

దూర విదేశ గాథలు చ♦తుర్దిశ సీమలకు న్నవీన సం
సారమనం,దమాపకయి ♦ చక్కిలి గింతలుగా, విశిష్ట శృం
గారపు కోటలందలి న♦గారలనం,గవి రాజ్యమందు బం
గారపు బొమ్మలై చను న♦గాధ రసప్రియ కావ్యభూమికన్॥ 3

చప్పటి సంగతి న్నవర ♦ సాస్పదభవ్య తరంగ సీమలం
దెప్పలఁ దేల్చి, దివ్యవన ♦ థిం జనుఁడెంచిన నౌకఁజేసి, త
ప్పొప్పు విమర్శఁజేసి తుద ♦ కుత్తమ పక్ష విచక్షణాంబునం
జెప్పుట బాలలీల. కవి♦సింహునకుం బృథు కావ్య భూమికన్॥ 4

చూడని యట్టి దుర్ఘటన ♦ సుశ్రితమై, కవిచాకచక్యమం
దీడికి నిమ్మహై, అది యి ♦ దేయన సృష్టికథా లలామకై
జాడలు జెప్పి తాను చడి ♦ చప్పుడు లేక విముగ్ధ నాటకం
బాడును. కావ్యరంగమున ♦ నందఱిచే భళి రే భళీయనన్॥ 5

చిత్రి మనోరథావళి వి♦శేష మధూలిక సారవాహినీ
పత్రికలందుఁ గన్నులకు ♦ బాహ్యములై స్థిరరూపమంది, స
ర్వత్రి మనుష్యజాతి పరి♦పక్వ విచారఫలంబులై కథా
సత్రములందు నుండుఁ గవి♦చంద్రుని శుద్ధ తపోబలంబునన్॥ 6

నల్లని వానిలో మిగుల ♦ నల్లనిదైనను, శిల్పకారిచేఁ
జల్లని చేతఁ జెక్కిన య♦శఃప్రతిమో! యనినట్లు, కృష్ణయుం
దెల్లని మల్లెమొగ్గయనఁ ♦ దీరొకతీరున, నద్వితీయ సం
ఫుల్ల శరీరధారియని ♦ బ్రోపడుఁ గావ్య విశాల భూమికన్॥ 7

రణమున, ఖణఖణఖడ్గ
ధ్వనులన, సంగ్రామ కేంద్ర ♦ దర్శనమునఁ ది
క్కిన చేతి మూగకలమును
వినిపించుచు నుండు నకట ♦ వికటపు నడకన్॥ 8

ముసిముసి నగుసొగసున సం
తసమున నొకసకియతో ని♦దానించిన యా
గుసగుసలో ముసురు కొనిన
రసము కవనభూమికా త♦రంగమయి చనున్॥ 9

వినయముతోఁ బెద్దలకడఁ
జనువగు చందమున వెడలి ♦ శరణాగత సా
ధనమునఁ గొనఁబడిన రసము
గనఁబడు నవరస నిధాన♦కావ్య మనమునన్॥ 10

తేలిక గారో జటిఖా
గాలయు నందఱికిఁ గంటఁ ♦ గనఁబడని విచి
త్రాలనఁ జూపింపఁ బడును
కాలక్షేప ప్రతిష్ఠ ♦ కావ్య వనమునన్॥ 11

శృంగార ప్రియనాటక
రంగంబని రాజుకేని ♦ రాణికిఁ గించి
త్భంగంబగు-యభినయములు
సంగతమగు చుండుఁ గవన ♦ సామ్రాజ్యమునన్॥ 12

---

# కలలలోని కలలు

---

నోరూరునట్టి రుచిఁగల
కూరలఁదిని నోచుకొనని ♦ కులమా! యేదో
యూరక కలలేని గనవ?
తీరికతోఁ దనివిఁదీరఁ ♦ దినిన విధమునన్॥ 1

నోరూరించెడి రుచిఁగల
గారెలఁ గని వినని వారి ♦ కల లందును నో
రూరిన చోఁ గల్పితమగు
గారెలకై కలలకేనిఁ ♦ గలఁగన వలయున్॥ 2

గురువరులు గాన భూసుర
చరణములనుఁ గడిగి త్రాగు ♦ శరణాగతులన్
వరమీయుని యీ పెద్దలు
కరుణింతుర? కలలనైనఁ ♦ గలలగు రీతిన్॥ 3

సిరిసంపదలను గలిగిన
మురిపెమున సనాతన ప్ర♦బుద్ధులు నేఁడీ
హరిజనులకు వరమిత్తుర?
కరుణింతుర? కలలనైనఁ ♦ గలలగు రీతిన్॥ 4

"హరినీవే" యని నమ్మిన
హరిజనులనఁబడెడి నేఁటి ♦ యస్పృశ్యులఁ ద
గ్గరదీయనట్టి పెద్దలు
కరుణించెడి యాశలన్ని ♦ కలలగు చుండెన్॥ 5

భారతమున నిట్టి దురా
చారములను గెంటి నట్టి ♦ శాసనమా! నీ
పేరూరన నీ హరిజన
వారమునకు మొదటి వేల్పు ♦ వా! యనఁదోఁచున్॥ 6



# కవి చౌడప్ప గారు

కొద్దిగఁ బెద్దవొ చిన్నవొ
పద్దియములఁ జెప్పుకొనుచు ♦ బ్రతికెడి కవుల౯
గద్దలగా నెంచిన నినుఁ
బెద్దన వెనుఁజఱచి పూలు ♦ బేర్చున? యప్పా! 1

మునుపటి పెద్దన పొందిన
ఘనతలు-మీరొక్కరేనిఁ ♦ గవిచౌడప్పా!
కననట్టి దానికిం బె
త్తన మేటికిఁ జిన్నకవులఁ ♦ దలవంచుటకు౯॥ 2

తెనుఁగగు భాషాయోషిత
మునుపటి వలెఁ గాద? గొడ్డు ♦ బోయినదా! పె
ద్దనకు సమానస్కంధులఁ
గనఁబోదా? ముసలిదయెన? ♦ కవిచౌడప్పా!॥ 3

ఘనకవినని, సర్వస్వ
మ్మనకుం దానొకఁడె పెద్ద ♦ మొనగాఁడని, పె
త్తనమెత్తెన? దొరనని పె
ద్దన యొకనాఁడేనిఁగాని ♦ దలఁచెనె? యప్పా!॥ 4

“ఘనులకు, ఘనతర కవులకు
ఖనియగు మన తెనుఁగుతల్లి ♦ కడుపున నింకో
గని వెదకి చూపినానని”
యనుకొంటివ? మోసబోతి♦వా? చౌడప్పా!॥ 5

కులమునఁ బలుచిన్నని కో
యిల గొంతుక లోనికులుక ♦ రింతలు మఱియుం
గలకంఠము కేసరికిని
గలుగునె? తలక్రిందులగుచు ♦ గడ్డిఁ గఱచినన్॥ 6

జిలిబిలిగాఁ బలుచని చు
క్కలకోకను గట్టుకొనక ♦ కడఁద్రోసినచో
జలివెలుఁగునకును గన్గొనఁ
గళ లెక్కడ? కాంతు లేడ? ♦ కవిచౌడప్పా!॥ 7

పలుచని అలకములు శిరో
స్థలమునఁ దలపాగ గావె? ♦ సంశయమా? గుం
తలభాగ్యము లేని తలకుఁ
గళ లెక్కడ? కాంతు లేడ? ♦ కవిచౌడప్పా!॥ 8

బలశాలులకైన నొకతి
యలిపిరిదో చిన్న దేనొ? ♦ యర్ధాంగియె కా
వలెనుగదా! యదెలేనిది
కళ లెక్కడ? కాంతు లేడ? ♦ కవిచౌడప్పా!॥ 9

అనుపమ సౌందర్యశ్రీ
ఖనులకె కాపురపుహక్కు ♦ కలదని నిర్ధా
రణఁ జేసినచో సాధా
రణలకు వనవాసమే! శ♦రణ్యమె? యప్పా!॥ 10

సారాంశంబేమన నూ
రూరునఁ గవినామతార ♦ లుండిననే యూ
వారిం బెద్దన చందా
కారంబై యుండఁగలిగెఁ ♦ గాదే! యప్పా!॥ 11

తిక్కనగారు! మీరును స్వ♦దేశములోఁ జనుదెంచి ఓసభా
పరీక్షకుఁ గూరుచుండి విష♦వాద వివాదవిమర్శకుల్ వినం
"దిక్కన నేనె! భారతము♦దెచ్చినవాఁడను నేనె!" యంచు నో
ముక్కవచింపకున్నఁదగు♦పూజ,పునస్స్మృతియూహలై చనన్॥ 12

---

# జిహ్వాద్వయదేవత

ఏకైక జిహ్వయును బలు
చీకాకుగ నేఁటికేనిఁ ♦ జీల్చఁ బడుట కో
లోకోత్తరమైన కలమ!
మాకై యింగితముఁ బలుకు ♦ మా! వివరమునన్॥ 1

లౌకికమును బాటించక
ప్రాకటముగ రేఁబవళ్ళు ♦ వదరెడిచో మీ
ఆకార వికారంబుగ
నోకలమా! రెండునాల్క♦లో యనఁగలిగెన్॥ 2

బాలకవి కృషినిఁ ♦ దబకో
తాలోయని యొగరఁగొట్టఁ ♦ దలఁచిన మీమీ
నాలుకలు జీల్చఁబడెఁ గాఁ
బోలు సరళనీతి లోప♦మునకో కలమా! 3

ఒకచోట సమర్థించిన
రకమును స్వార్థమునకై -స♦రాసరి అకటా
వికటముగా ఖండించిన
ప్రకరణమా! నాల్కలిట్లు ♦ బ్రద్దలయిజనన్ ॥ 4

కాలక్రమమునకుం బ్రతి
కూలంబగు వ్యంగ్య-శైలి♦గూడినచో మీ
నాలుకలు జీల్చఁబడెఁగాఁ
బోలును లౌకికవిధాన♦మునఁ బాఠమనన్ ॥ 5

---

## జయపతాక

సుదినంబగు యాగస్టవ
పదినైదవ తేది నాఁడు ♦ పరవాఁగు మమున్
వదలిన సౌభాగ్యదినం
బిదియే ఋషితుల్యభార♦తీయ చరిత్రన్ ॥ 1

పండుగునకు వేయింతల
మెండైన సువర్ణదినమ! ♦ మిత్రస్మృతిగా
నుండుమ! కలకాలభరత
ఖండ చరిత్రాత్మగర్వ ♦ గర్భమిది యనన్ ॥ 2

భావాతీత యశస్సులన్ నిరత స♦త్త్వప్రౌఢిమన్ శాంతులన్
ధావళ్యంబుగఁ జూపునట్టి ధ్వజమా! ♦ తత్త్వార్థ సంశోధక
త్రైవర్ణంబ! సదా యశఃప్రతిమవై ♦ దైవంబవై, నైతిక
ప్రావిణ్యాన్వయదూతవై, భరతసౌభాగ్యాంబవై, యుండుమా ॥ 3

తిండికి భారతీయ సుర♦దేశములోఁ దగుబట్టబాతకై
యుండుట కిండ్లకుఁ సమక్ష ♦ యుక్త ఫలప్రద సస్యభూమికిం
బండితస-ఖ్యకుఁ హరిత ♦ వర్ణపరంగ సమృద్ధిఁ దెల్పుచుఁ
యుండెడి దాన! ఓ ధ్వజమ! యుండుము భారతలోకమౌళివై ॥4

శౌర్యక్షేత్రములోని క్షాత్రమునకుఁ♦జంఘారులం బోలి, గాం
భీర్యప్రాంత మహాసముద్ర సరణిఁ ♦ విస్తీర్ణ విజ్ఞానులై,
స్థైర్యస్థాపక మేరుపర్వతములై ♦ శాసించు చున్నట్టిమా
యార్యశ్రేణికి లోహితచ్ఛటలు ని♦ల్వాయెంబ తాకాప్రభఁ ॥5

మున్నటి చక్రపాణివయి ♦ మూడుముఖాలనుఁ గన్నదానివై
మిన్నలలామవై, పరమ ♦ మిత్రమవై నిజమార్గ దర్శివై
యున్నతనైతి కాన మము♦నొక్కటిగా నొనరించినందుకై
నిన్ను నమస్కరించెదము♦నిన్ను భజింతుము భక్తిభుక్తిఁ ॥ 6

భరతప్రాంత విశిష్ట పుణ్యఫలమా!♦ స్వారాజ్య సాఫల్యమా!
తరణోపాయ సమాన దేశధనమా! ♦ త్రైవర్ణమా! నాఁటి స
త్పురుషశ్రేణులచేతఁ బాదుఁబడి సం♦ఫుల్లాత్మురాలైన యం
కురమా! హైన్దవ కల్పవృక్ష సమమా!♦కోటేండ్లు వర్ధిల్లుమా!7

మునుపు స్వారాజ్యదేవత క♦పూర్వ ఫలంబగు శుద్ధశాంతితో
రణము నొసంగినట్టి ధ్వజ♦రాజమ! యుండుము! విశ్వశాంతికిం
బెనుగిడునట్టి పెద్దలకుఁ ♦ బెన్నిధివై, సదుపాయనీతి సా
ధనమయి, ఐక్యసంపదకు ♦ దైవతమై, నిజవైజయంతివై ॥ 8

సింధుప్రాంతకలహా దు
ర్గంధములను గెంటి యాస్య ♦ కర్తవ్యముగా
సంధించి పరస్పరులను
బంధించుమ! భారతీయ ♦ బాంధవ్యమ్మున్॥ 9

సురభిప్రియ విశాల పుణ్యావతియై ♦ శుద్ధాత్మురాలై సదా
స్థిరురాలై మధురాసమీప యమునా ♦ తీరస్థయై దేవతా
సరణిన్ భారత రాజకీయము, ఘన♦ శ్యామా! నినున్ వేఁడెన్
మురళీగానముఁ జేయవా! మరలమ♦మ్మున్ జూడవా! తీరదా?॥10

నినుఁ జూచినంత హైందవ
గణమునకుం బూర్వకాల ♦ గంభీరతపో
ధనవంతుల కొనఁగూడిన
గుణములొనం గూడుఁబంచు ♦ క్రొనిన విధమునన్॥ 11

మగువలు కోమలలై కలి
యుగమందు స్వరాజ్య శాంత ♦ యుద్ధమున జయం
బగురీతిం బోరాడిరి
జగదంబకు నైన లేని ♦ స్థైర్య బలమునన్॥ 12



# లౌకికము

---

జలనిధులు ♦ మాదుగుల – కల
గలుపునఁ దలలారఁ దాము ♦ గడుగు కొనుటన్
జలకమ్మాడని వయెనని
కులతప్పగునేమొ? విప్ర ♦ కోటి విమర్శన్॥ 1

మాదుగులను నెత్తుకొనిన
భూదేవికి బుద్ధిలేద? ♦ పొరఁబడెనా? యీ
వైదికులను ముట్టనియెడఁ
బోదనుచు బహిష్కరింపఁ ♦ బోరే? నేఁడున్॥ 2

చండాల కులాన్వితపా
ఖండుల నొకపెట్టు ముట్టి ♦ ఘన పండితులన్
రెండింటఁ గాఁగలించెడి
ఎండకు లౌకికము దెలియ ♦ దేమో! నేఁడున్॥ 3

మాలకులంబులన్ మిగుల ♦ మాదుగులన్ దినమెల్ల ముట్టుచుం
బాలపెరుంగులందుఁ దేల ♦ వారిన వారినిముట్టునట్టి యీ
గాలికి లౌకికక్రమము ♦ గన్పడదయ్యెను గాన దీని నో
మూలకుఁ బిల్చి మాలలను ♦ ముట్టకుఁడంచు విధింప రేటికో॥ 4

ఏ తోట మాలమాదిగ
వాటికలో జలదమూర్తి ♦ వర్షించినచో
నేటికి? యాకృతిక్రమ మత
మేటికి? యానీతిలోప ♦ మేటికి మాకై॥ 5

# మహాగవేల్పు

---

బరిమేనికలమ! నీకీ
సిరియేడిది? దానకర్ణ ♦ శీలధనమ! స్త్రీ
పురుషులకు నలంకారా
భరణములనుఁ బంచియిడెదు ♦ బండ్లకొలందిన్॥ 1

నోరాడని పత్రులచేఁ
బ్రారూఢ కథామృతపానఁ ♦ బలికించిన మీ
వారలకే నోరాడని
ప్రారబ్ధము వ్రాసి, నాడు, ♦ వాఁడుఁ పొరఁబడెన్॥ 2

కానున్న కథాకంధుల
లోనగు లోతైన మడుఁగు ♦ లోని విషయముం
బైనెత్తి చూప వచ్చును.
గా నోదధిమకరరాజ ♦ కవికలములకున్॥ 3

రానున్న విశేషకథా
ధేనువులనుఁ దెచ్చి పిదికి ♦ తియ్యని కవితా
పానకమునుఁ దేవచ్చును.
గానవ్యాసంగకృష్ణ ♦ కవికలములకున్॥ 4

నానాభాషాగత వి
జ్ఞానముపైఁ నవనవీన ♦ కౌతుక కథలన్
వానం గురిపింప నగును
గానవ్యాసంగ విశ్వ ♦ కవికలములకున్॥ 5

ఏనాఁడును గనియెఱుఁగని
దానిని వినఁదగిన యొక క♦థం బ్రత్యక్షం
బైనాననఁ జూప నగును-
గానవ్యాసంగ వికట ♦ కవికలములకున్॥ 6

నాదబ్రహ్మ విశిష్టతత్త్వమును నా♦నా గాథలన్ గట్టిగాఁ
బాదుంబెట్టిన యట్టి నాఁటికలమా! ♦ బ్రహ్మాండమైనం జతు
ర్వేదాలం గనినట్టి బెబ్బులులకున్ ♦ వేయేండ్లకున్ లేఖినీ
పాదాక్రాంతము గానిపక్షమునఁ జే♦వ్రాలేని సాధించునే?॥ 7

కలియంకం గవిరాజదండమగు నాం♦గాశల్య ఖడ్గంబునం
గులవిద్యాభిరుచి ప్రకారమున నే♦కోటాను కోట్లైన వా
క్కులహారల్ విడఁదీసి "శేషి" యన నుఁ♦ద్గ్రంథాలకై తల్లియై
వెలసెం జేతికలంబు, సత్కవితకున్♦ వేనోళ్ళ వేల్పోయనన్॥8

సురుచిర గాన జానపద ♦ సుస్వర వాద్యములార! మీకు శ్రీ
హరియనఁ "త్యాగరాజు" మొద♦లైన మహాకవి గేహలేఖినీ
కరుణ,-సహస్రశక్తులఁ♦గాఁ బ్రకటంబయి, కుంభవృష్టియై
వరదలు బారకున్న నొక ♦ పాటఁ గనీసము పాడనేర్తురే?॥ 9

సారస్వత భూమికకా
ధారంబగు నవవిచార ♦ దానవ్రతబృం
దారకులకుఁ దోడుపడిన
ధార,-కలములోనఁ గాద ♦ తలఁదాచు కొనన్॥ 10



# కాతలేని కొమ్మ

—: :—

మగని మెడలలోని ♦ మంగళ సూత్రాలు
గా నటించి క్రొత్త ♦ కాపురమునఁ
బడకటింట మెడకు ♦ మెడ బిగించుట సాగు
నొక్కపాప చంక ♦ నెక్కదాక॥ 1

పొద్దుబారెడెక్కి ♦ పోయిననో-వాని
విడువకుండు నట్టి ♦ పడఁతులార!
అత్త, చూచి చూచి ♦ అర్థాంతరన్యాస
కుత్స, బిడ్డననిన ♦ కొలఁదిఁబెంపు 2

నక్కటొక్కలంది ♦ పుక్కిటి కోపాన
మునిఁగి పోవువరకు ♦ ముసుఁగుఁ గొనుచు
ములుగునట్టి మురిపె ♦ ములు సాగునో! కొమ్మ!
పిలుకకాత నీకుఁ ♦ గలుగువరకు॥ 3

ఆడుబిడ్డతోడ ♦ నత్తమామలతోడఁ
గలహమాడి తల్లి ♦ గారియింటఁ
బోయెదనని మాట ♦ ముల్లెఁ గట్టుటవచ్చు
పూతకాతయగుచుఁ ♦ బోవువరకు॥ 4

ఆడు పావలార! ♦ అర్ధాంగులై మీరు
సగము మూడుపాళ్ళు ♦ శయ్యకొరకుఁ
గాళ్ళఁజాపుచుండ ♦ గారడమా! తల్లి
అర్థమునకనర్థ ♦ మైన యట్లు॥ 5

# రాజకవులు - కవిరాజులు

---

నవరస రత్నాకర సం
భవ కవిచంద్రములు లేత ♦ ప్రాయములో నే
కవన కళాపారంగత
కవులు గలరు. కలియుగానఁ ♦ గలరాంధ్రమునన్॥ 1

శ్రవణానంద రసప్రియ
కవితానిధిలోన మకర ♦ కల్పములై రేఁ
బవలందు నిమగ్నులయిన
కవులుగలరు? యనినయెడలఁ ♦ గలరాంధ్రమునన్॥ 2

కవితా రాజ్యశ్రీవై
భవసీమోల్లంఘన ప్ర♦భాతమునకు నో
యువరాజనఁ దేజోముఖ
కవులుగలరు కలియుగానఁ ♦ గలరాంధ్రమునన్॥ 3

నవసృష్టియనంగ వివిధ
కవితా విధినియమ సృష్టిఁ ♦ గల్పించి స్వయం
భువులంతటి వారనఁదగు
కవులుగలరు సంస్కృతమునఁ ♦ గలరాంధ్రమునన్॥ 4

కవితాకన్యకను పదా
వ్యవసాయ సమాస రుచిర ♦ భాగవతకథా
భవనమునఁ బ్రసాదించిన
కవులుగలరు సంస్కృతమునఁ ♦ గలరాంధ్రమునన్॥ 5

భవసాగరమున స్వర్గము
నిలిపిరి మఱిదానికొఱకు ♦ నిచ్చెనలునుఁ దేఁ
గలిగిరన కవిప్రముఖులు
గలరు విశాలాంధ్రి విశ్వ ♦ కర్మలనఁ దగన్॥ 6

---

## మషీరస పారావారదేవత

---

కలమా! నీ కులసతులకుఁ
గలిమిం దెల్లంగ పుల్లఁ♦గా నుండుటకున్
వలదే? శాప లలాటము
కలదే? ఆ జన్మ శాప ♦ ఘట్ట మనఁ బడన్॥ 1

గుఱి మరి కూడలను మఱచి
దురదఁ గొనిన రీతిఁ గవుల ♦ దూషించిన వా
క్సరణినిఁ దేఁగలిగిన దే
వరవారికి మసిమొగాలు ♦ వలదే? కలమా!॥ 2

కసిఁదీరఁగ భీభత్సపు
రసవిషమునుఁ గ్రక్కునట్టి ♦ గక్కుసలగు మీ
నాసటికి నేఁడేని మషీ
రసమునఁ బొరలాడ వలసి ♦ రాదే! కలమా!॥ 3

ముసిముసి మొగములుఁ గలిగిన
పసిబిడ్డల నమ్మెననఁ గ♦వన సుకుమారిం
బొసఁగని దొరకమ్మిన దు
ర్వ్యసనమునకు మసిమొగాలు ♦ వలదే? కలమా!॥ 4

వసఁబోసిన చందమ్మైన
ముసలిది గొఁణిగిన విధంబుఁ ♦ బోలినచో మీ
నొసలందలి లిపికి మషీ
రసమే నాఁడేని దాపు ♦ రంబయెఁ గలమా!॥ 5
తెరచాటునఁ బడియుండిన
దొరసాని రహస్యములను ♦ దొరల యెదుటనే
సరసంబని వినిపించిన
మురిపెమునకు మసిమొగాలు ♦ పొసఁగెన? కలమా!॥ 6
మిసిమినిఁ దేఁగలనని, ఛాం
దసుని కవితఁ గొనిన పిదపఁ ♦ దనదేయని సం
తసమునఁ బ్రకటించిన దు
ర్వ్యసనమునకు మసిమొగాలు ♦ వలదే? కలమా!॥ 7

---

## పునరావేశాభిగామి

వినయ విగతుఁడై నందున
జనకంటకుఁడైన దాని ♦ స్వజన ముఖమునం
గని విని దుర్యోధన గుణ
పునరావేశాభిగామి ♦ మూర్ఖుఁడనఁ బడున్॥ 1
మునుపటి పెద్దల సాధా
రణులని లెక్కించి యుత్త ♦ ర ప్రజ్ఞ సూ
చనఁజేసి చూచునోయనఁ
బుసరుక్తిం జేయువాఁడు ♦ మూర్ఖుఁడనఁ బడున్॥ 2

తనవాదిని గిల్లి, బరికి
తనకు విపక్షమునఁ బంపి ♦ ద్వాపర దుర్యో
ధన కపటాన్విత గాథా
పునరభ్యాసాభిగామి ♦ మూర్ఖుఁడనఁబడుఁ॥ 3

కనఁబడిన పడుచు లెల్లరు
కనుగిలిపిన తోడనే యె♦కా యెకి నా చం
కన నిరుకుదురని కీచక
పునరావేశాభిగామి ♦ మూర్ఖుఁడనఁబడుఁ॥ 4

వినఁదగిన సుభాషితమును
వినక పొరుగు వారినైన ♦ వెంబడిఁగొని రా
వణ దుష్పరిణామ కథా
పునరావేశాభిగామి ♦ మూర్ఖుఁడనఁబడుఁ॥ 5

## పుష్పమాలలు – మాలలు

మాలకులంబ! నీవు నియ♦మంబుగఁ గంకణ బద్ధరాలిగా
శీలబలాఢ్యవై పగటి ♦ సింహ మన న్నిజదేశ శత్రుగ
ర్వాల నడంగఁజేయ నవ ♦ భరత లోక విశాల వాహినీ
మాలలఁగాఁ జనఁ భరత♦ మాత ధరించును గాద నిన్ సిగన్॥1

మాలసమాజమా! సరి స♦మానముగా నిజదేశ సీమలం
గాలపరంపరా గహన ♦ గర్భములో సకలార్థ సిద్ధ సూ
త్రాలయ వీధులందలి య♦నన్య దయామయ లోక సేవకై
మాలయనం జనన్ భరత♦మాత ధరించును గాద నిన్ మెడన్॥2

శరణాగత వనచరులను
దరిఁదీసిన యోయ పూర్వ♦దాశరథీ! యా
కరుణా రసవృష్టి మఱలఁ
గురిపింపవ? యిట్టి దళిత ♦ కులకోటి పయిన్॥ 3

యదువంశాంకుర! బాలకృష్ణ! యిదిగో♦యస్పృశ్యులంజూడఁ దీ
రదురా! పిల్లన గ్రోవిఁ జేతఁగొనుచున్♦ రావేటికిన్? సర్వ స
మ్మద గీతామృత వృష్టికై పృథివిపై ♦ మాకై మఱోసారి రా
వదెరా? కోపము వచ్చెనా? కలియుగం♦బన్నంతఁగంపింతువా?॥4

మాలకులా వతంసమ! ర♦మాపతి పాలిటఁ జేరిన న్నినుం
బాల సముద్రమందుఁ బిడ♦పం బెరుగందు మునుంగఁ జేసి, దే
వాలయ శిల్పమేని, ద్వయ ♦ పాదగతిన్ స్వయమేవ నీ కెదు
ర్కోలున రాఁడ? నీకడకుఁ♦ గుడ్య సహస్రము లడ్డువచ్చినన్॥5

భారత నవయువక సదా
చారమ! ఆచరణమందు ♦ సద్భావ మనః
పారంగత మాలల-మన
వారని దరిఁదీయుమా! స్వ♦భావ బలమునన్॥ 6



# భావనాధనము



బడిపిల్లలు తమలోఁ జెడ
మడ బూతుల నోటఁగ్రక్కి ♦ మరిపూటం గుం
డెడు తేనెలొలుకెనో యను
నడక-కవనలోక భావ♦నా ద్రవ్యముగున్॥ 1

బుడుతలకుఁ జెల్లివచ్చిన
పడికట్టున వచ్చిరాని ♦ బాసయనన్ బం
డెడు చిలుకపలుకు లొలికిన
నడకఁ-గనిన కయిత భావ♦నా లోకముగున్॥ 2

పడకగదిన్ జోడుగ గుడు
గుడు గుంచములోని ప్రణయ♦కోప ప్రతిభన్
మిడిసి పడిన సింగారపు
నడకనుఁ బోలినది-భావ♦నా దృశ్యముగున్॥ 3

కుడియెడమల నంతటఁ గ
న్పడిన పదార్థములలోనఁ ♦ బలువురికినిఁ గ
న్పడని విషయమునుఁ దెలిపెడి
నడక-కవనలోక భావ♦నా దృశ్యముగున్॥ 4

అడుసునఁ బడి పొరలాడుచుఁ
జెడిపోవని దారి సుమతిచే ♦ "కొడుకులమున్
నుడువఁ బడెనో!" యనఁ బలుమే
ల్నడక-కవనలోక భావ♦నా దర్శనముగున్॥ 5

జడమతులకు నెంతో౯ బో
వ్వడఁ గవిచౌడప్పగారు ♦ బహిరంగము నం
దౌడపాశములం బెట్టిన
నడక-కవనలోక భావ♦నా దర్శముగన్॥ 6

## గర్భిణీ స్వప్న సామ్రాజ్యము

కొడుకునుగన్న చోఁ బడుచు ♦ కోడలు గూడ నొకర్తు వాని వెం
బడి దొరసానిగాఁ నలరు♦పైనటనిల్లెదు రాజలం గడున్
గడగడలాడఁ జేయునని ♦ కల్పితమైనను స్వప్నసౌఖ్యమీ
కడఁ గనుదాన! రాత్రిలు సు♦ఖప్రదముల్ గద! నీకుగర్భిణీ!॥ 1

కూతురుబుట్టినం బరుల ♦ కోడలుగాఁ జని అత్తగారిచేఁ
గోతలకో యురింబడిన ♦ గోవువలె న్నిజమైన సాధ్వియై
రాతిరి భర్తతోఁ గుపితు ♦ రాలయి యేలికయైన సంపదం
జూతువుస్వప్న భాగ్యమున♦ జూతువుముండటి పెంపు-గర్భిణీ!॥ 2

తలలు మునుంగ నప్పుఁగొను♦దంపతు లందలిదాన! యింటివా
రలను మరోఋణంబున శి♦రస్సు మునుంగెడి రీతి-బిడ్డ బ
ట్టలకని-లేనిపోని జగ♦డాల నొనర్చిన యట్టిస్వప్న వా
క్కలహ జయానుభూతిఁ గొను♦కంకణమై చను నీకు గర్భిణీ!॥ 3

మరిపెంబుంగనినట్టి నీకొడుకదే ♦ మున్ముందు విద్యార్థియై
పరదేశంబున భారతీయుఁడయి స♦ర్వప్రజ్ఞలం జూపి సా
దరణన్ "నోబెలుప్రాయిజుం" గొనినవా♦ర్తన్ విన్ననో గర్భిణీ!
పరువుల్ బెట్టుట చేత నౌన? యదియున్ ♦ స్వప్నంబొ
యేమోసుమీ!॥ 4

"కొడుకా! నీవు స్వతంత్రరాష్ట్రపతివై ♦ క్షోభించియున్నట్టియీ పుడమిన్ బీదల కల్పవృక్షమగు నిన్ ♦ భూమాత యే నాకు నాఁ డొడిలో వేసెనుగాన-నో ఫలము! మా ♦ యుత్సాహభాగ్యమ్ము! యి య్యెడ మా యాశల నిల్పుమా!" యనుచు నీ ♦ వే మేమొ మాటాడు చుం
డెడి వేళన్ మగఁడేటికో పనిఁబడన్ ♦ నిన్ లేపెనో గర్భిణీ!॥5

ఆడుబిడ్డలతోఁ గోడ ♦ లాడిపోని
కలహ రంగాల సంగళ్ళు ♦ గనిన యంత
స్వప్న సౌఖ్యాన నీ కేల ♦ భంగమమ్మ!
గర్భిణీ వాంఛితంబు తె ♦ కాదె కొమ్మ!॥ 6

---

## భావనా దృశ్యము - దృశ్య భావన



చూపునఁ జుక్కల మించిన
రూపవతుల కుండునట్టి ♦ రుచి మచ్ఛంగా
రోపేత రసప్రద వా
ఙ్మపుణ్య మనన్య భావ ♦ నా దృశ్యమగున్॥ 1

తాపసులకు శాంతిమత
స్థాపకులకు నుండునట్టి ♦ సత్త్వ ప్రాభా
న్యోపేత రసప్రద వా
ఙ్మపుణ్య మనన్యభావ ♦ నా దృశ్యమగున్॥ 2

దీపానికిఁ బ్రతిరూపపు
దీపంబగు రాణియుం బలితిన్ బీభత్స
వ్యాపారము నందీడ్చిన
నైపుణ్య మనన్యభావనా దృశ్యమగున్॥ 3

తూపానులఁ దులఁ దూగిన
చూపులకు సహాయపడిన ♦ శుద్ధక్రోధ
వ్యాపార సాధనము సాం
గోపాంగముగా నటించు ♦ నుద్ధ్రంథకథన్॥ 4

---

## గడ్డిఁగఱచునట్టివారలు

సురుచిరమగు పేర ♦ వరదక్షిణల పేరఁ
దెలియక యొకయింతఁ ♦ దెలిసి కొంత
నాత్మగౌరవమును ♦ నమ్ముకొనిన వారు
గడ్డిఁ గఱచు వారు ♦ గలరు నేఁడు॥ 1

చూపు కేని లేని ♦ పాపాత్ములనుఁ జేరి
యించుమించు చంద్రు ♦ లంచుఁ బొగడి
పాడు కవికలాలు ♦ పైసాసచేఁ గొంత
గడ్డిఁ గఱచువారు ♦ కలరు నేఁడు॥ 2

కలలనైనఁ గలువ ♦ కంటి నైగలుపైన
వ్రాలినట్లు భ్రాంతి ♦ పడిన వారు
లేవలేక లేచి ♦ లేచిపోయెడి వారు
గడ్డిఁ గఱచువారు ♦ గలరు నేఁడు॥ 3

కనకమునకుఁ గాని, ♦ కాంతలకై గాని,
భూమికేని స్వార్థ♦మునకుఁ గాని,
కనుమఱుఁగునఁ గాని ♦ కనుల మూసియె గాని
గడ్డిఁ గఱచువారు ♦ గలరు నేఁడు॥ 4

తప్పుదారి వారు ♦ తారతమ్యంబన్న
లేనివారు సిగ్గు♦లేనివారు
ప్రౌఢ వాగ్వివాద ♦ బలశాలులగు వారు
గడ్డిఁ గఱచువారు ♦ గలరు నేఁడు॥ 5

తెలియకున్న నెంతొ ♦ తెలిసిన చందాన.
వెఱ్ఱివానివోలె ♦ విసుఁగు లేక
సిగ్గులేక చెవులు ♦ చిల్లులు బోవంగ
వక్తలైన పెద్ద ♦ వారు గలరు॥ 6

సీ॥ అత్తమామలయొక్క ♦ ఆరడిచేఁ గొంత
నాడుబిడ్డలశాసు♦కోడి కొంత
లావులేని మగని ♦ లక్షణానకుఁ గొంత
చుట్టుపక్కల వారిఁ ♦ జూచి కొంత
పురుషులతోఁ గూడు ♦ మురిపెమునకుఁ గొంతఁ
జిత్ర చేష్టాగోష్ఠి ♦ చేతఁ గొంత
పైసాసచేఁ గొంత ♦ పరయింటిలోఁ గొంత
సింగారపు సమృద్ధి ♦ చేతఁ గొంత.

ఆ॥వె॥ సత్కులమునఁ బుట్టి ♦ సత్పాత్రమునఁ జేరి
రంకు నేర్చినట్లు ♦ బొంకు నేర్చి
సరిమరుంగులందుఁ ♦ బరులపంచలఁ బోయి
గడ్డిఁ గఱచువారు ♦ గలరు నేఁడు॥ 7

సీ॥ పెండ్లిలేకో యింటఁ ♦ బెద్దదక్షత లేక
ఒంటరిగా నింట ♦ నుండలేక
ఇల్లాలిచేఁ బడ్క ♦ టింటి సుఖము లేక
కలుషబుద్ధికోల ♦ ాములేక
కులటల వ్యవసాయ ♦ ములనుఁ గన్గొనలేక
ఆత్మావలోకనం ♦ బసలె లేక
సత్సంగమును లేక ♦ సంస్కారమును లేక
దమన దార్ఢ్యములేక ♦ తాళలేక॥

గీ॥ చిలిపి వాఁడనఁబడిననో ♦ సిగ్గులేక
బుద్ధివంతులకున్నట్టి ♦ శుద్ధి లేక
తిన్నదరగక యింటింటఁ ♦ దిరగ మఱఁగి
గడ్డిఁ గఱచిన మగవారు ♦ కలరు నేఁడు॥ 8



# ఇది – మీసమ?

---

చచ్చినయట్టి యాసగరసంతతికై సురలోక జాహ్నవిం
దెచ్చుటకై భగీరథుడు ♦ దీక్ష వహించెను గాని నేటికిం
జచ్చినదాక మాలలగు ♦ జాతి విముక్తి విచారధారయుం
దెచ్చినవాఁడు గాఁడు జగ♦తిన్ భువనైకమహాత్ముఁడోయనన్ ॥1

ముప్పది మూఁడుకోట్ల సుర♦పుంగవులుండియు నొక్కఁడేని నేఁ
డిప్పటికేని మాలలకు ♦ నీగతులేలని పట్టుఁబట్టి, త
ప్పొప్పు విమర్శ జేసినను ♦ నోడుదుమోయని దూరదృష్టితో
నిప్పటికిన్ భయానఁ గను♦పించరు. పాపము చూడఁగోరినన్ ॥2

వరుసగ ముగ్గురైరె వికట♦వాద వివాదసమస్యలన్ జగ
ద్గురువులు గారు—దీర్చి తుద♦కుం గడజాతి సమస్య నేకమై
చఱచిన వారుగాని యొక ♦ సంగతి వారికి శంకమై చనన్
హరిజన సంఘశుద్ధికి, ద♦యామయుఁడేచనె నీ మహాత్ముఁడై ॥3

పేకన్ ట్రుంపునకుండెడి
తూకముతో నిమ్నజాతి ♦ దుర్భర గతులం
గైకొనిన వాఁడుగనఁబడఁ
డీకడ నొకఁడేనిగాని ♦ "యిదిమీసమనన్"॥ 4

పేరూరునకును బదియవ
తారములో దలితజాతి ♦ దండును మమతా
పారగులై యేలిన వా
రేరీ? యొకరేనిగాని ♦ "యిదిమీసమనన్"॥ 5

భారతదేశశాసన సు ♦ నాసిని! మూలసమాజలాభ సం
స్ఫార యశంబులంగాంచ ♦ చల్లని తల్లివి నీవె! గాని నీ
వారిని రాజదండ కర ♦ వాలముచే వినిపించినట్టి ఓ
నేరముకొంత నీపయిన ♦ నిల్చెంగదే యితిహాసభూమికన్॥ 6

---

# గర్భిణీ!

---

సీ॥ పడకటింట మగఁడు ♦ గడియకు నొకసారి
విధివిరామము లేక ♦ పిలుచుచుండ
కన్నకొడుకే గాని ♦ కౌతుకమునకే మొ!
యేడ్చియైనఁ గొంగు ♦ లీడ్చుచుండ
దయ్యాలుగా గట్టి ♦ ద్వారపాలకులట్లు
బిచ్చమునకు నార్చి ♦ పిలుచు చుండ
ఎంతఁ బెట్టినఁ గాని ♦ కొంతయల్లునిఁ బోలి
బిడ్డలభినయించి ♦ బిగియు చుండ.

గీ॥ అంత నాయాస పడుచుండి ♦ నట్టి వేళ
చేతఁగానె కాదని నొక్క ♦ చెప్పనైనఁ
జేతఁగాదేమొ! బంగారు ♦ చిలుకయైన
గర్భిణీ! ఓపలేని నీ ♦ కర్మమునకు॥ 1

జపముచేత సులభ ♦ సాధ్యంబు గానట్టి
కన్నతల్లులయెడ ♦ గౌరవమునఁ
గడుపు పెరిగెనేమొ? ♦ గర్వసంతోషంబె
పట్టలేనియట్లు ♦ బలిసె నేమొ?॥ 2

పిడుదు పట్టినట్లు ♦ విడువ నేరనివాఁడు
కేఁకి రెట్టఁబట్ట ♦ వలదటంచుఁ
జేతిసైగ కేని ♦ చేతనగునా! కాదా!
ఓఁపలేనియట్టి ♦ పాపమునకు॥ 3

రానురాను ముందు ♦ ప్రాణగండంబైన
ప్రసవ వేదనములు ♦ ప్రాప్తమయ్యెడి
చింతఁ జేయనైనఁ ♦ జేతనగునా! కాదా!
గర్భధారణ ప్ర♦కరణ మందు॥ 4

మగని చూపుకై స♦మక్ష లక్ష్యయగుచు
సంతసమునఁ బెద్ద♦జాము సేపు
సరసమాడు కేని ♦ బరువగునో! తల్లి!
మూఁడుమూళ్ళ నెలలు ♦ మోయునపుడు॥ 5

చాడిగొట్టు వార♦లాడు బిడ్డలు నేఁడు
నారద ప్రదర్శ♦నములఁ జూపఁ
జిదురుకొనుట కేని ♦ చేతనగునా! కాదా!
పసుపుబారినట్టి ♦ పడతులార!॥ 6

ఎన్ని యోవిధాల ♦ నేకాంతరంగాలు,
కౌతుకాలు దొంగ ♦ గారవాలు
గర్భధారణమున ♦ గండాలు గావచ్చె
నాను నెలలు ముదిరి ♦ నట్టు లుండె॥

సీ॥ ప్రతిపురాణ సమర ♦ రంగ కథలలోనఁ
బ్రత్యక్ష దైత్యులై ♦ పఱఁగు వారు

జనకులయెడి వారు ♦ జనయిత్రులగువార
లవతారమునఁ బుట్టి ♦ ఁట్టివారు
పాలకులై న్యాయ ♦ బాహ్యులయెడి వారు
పాలితులై కష్ట♦పడెడి వారు
చిల్లిపైసనుఁ జూచి ♦ చిత్తుబో త్తగు వార
లాఁకొని పాపాత్ము ♦ లైన వారు.

ఆ॥వె॥ స్త్రీసమాజ గర్భ ♦ సీమాంత రంగాన
జలకమాడి తీర ♦ వలయుఁ గాన
ప్రప్రథమమూన దె ♦ బద్ధాంజలులుగార!
గర్భిణీ పరిణామ ♦ కౌతుకమున॥

పిండనామ ఫలము ♦ పితృదేవతలకిచ్చు
నట్టి పుణ్య ఫలిత ♦ మడుగకుండ
ప్రసవకాలరామ ♦ రక్షయో యన్నట్లు
గర్భవతుల నెల్లఁ ♦ – చుచుండు॥

గర్భిణీ! యీసుఖోపేత ♦ కష్టమునకు
దొంగ కోర్కెలు లోఁగొనఁ ♦ దొంగిచూచె
బిడప నద్దె "ఆశానామ" ♦ పిండమయ్యె
కప్పగంతుల నలవడె ♦ గడుసుదయ్యె
తీరుతీరు పదార్థాలఁ ♦ దినినదయ్యె
బలిసె-డొక్కలో నొక చిన్న ♦ బల్లెమయ్యె
దాచుకొన విలుగానట్టి ♦ ద్రవ్యమయ్యె
దివ్యసంసార సౌభాగ్య ♦ తిలకమయ్యె

సరస దాంపత్య లక్ష్మీప్ర[illegible]మయ్యో
ఆలుమగల సంబంధాల ♦ కభయమయ్యో
పచ్చనైన పందిరి కాల ♦ హాలమయ్యో
పడకటింటి వ్యాపార సా♦ఫల్యమయ్యో
పౌను కోరిన దేవచ్చి ♦ నట్టినయ్యో॥ 10

---

## మనపునరాగమనము

మనవారై సద్వర్తన
ధనికులు నడుమంతరాన ♦ దౌర్భాగ్యవశం
బున అంటరానివారై
చనినం బెద్దింటిలోనఁ ♦ జచ్చిన యెడలన్॥ 1

మునిపుంగవునకుఁ జెందిన
జనులై కోటానుకోట్ల ♦ సంఖ్యలుగా నేఁ
డును బంచము లనఁబడుటకుఁ
జనినన్ మాదిగిరికమునఁ ♦ జచ్చిన యెడలన్॥ 2

ముని సంతతులం గొందఱు
ఘనులై కొందఱు మహావి ♦ కారసమాజం
బున మునిఁగి పోవువారై
చనినం బలుబీదలగుచుఁ ♦ జచ్చిన యెడలన్॥ 3

మునులకుఁ దులఁదూగిన జీ
వనయాత్రికులయ్యుఁ బాడు ♦ పంచమవర్ణం
బున మునిఁగి తెప్ప తేలక
చనినన్ దరిదాపు లేక ♦ చచ్చిన యెడలన్॥ 4

మునివశాసమునన్ మీామీా
పనిపాటలఁ జేసినట్టి ♦ ఫలితమునకు? చ
చ్చినదాక మూల కై
చనినన్ గ్రామాంతరానఁ ♦ జచ్చిన యెడలన్॥ 5

మునుపటి మనువులు తమకొక
పని గలిగెనటంచుఁ దలంచి ♦ స్వర్గనివాసం
బునుఁ బాసి, భూమిఁ ద్రిప్పుచుఁ
జనరే? పునరావతార ♦ సంకాశమునన్॥ 6

---

## కవుల పైఁ గోపము

---

అజునకు నిల్లాలా! నీ
భజనపరాయణుల నోటఁ♦బడియున్న న్నీ
రజభవుఁడు సహింపఁగలఁడ?
నిజవాణి పరాయినోట ♦ నిజధనమైనన్॥ 1

భువనత్రయ జనులకు నై
భవ లేఖలు వ్రాయువాని ♦ పరమప్రియవై
కవికుల విషయమ్ము భవత్
ప్రియునితోఁ గొంతనైనఁ ♦ బలుకవు గాదే!॥ 2

బ్రహ్మాండము విఱిగి, నవ
బ్రహ్మలు తలక్రిందులయెడి ♦ పక్షములో నీ
బ్రహ్మను-నిహలోక కవి
బ్రహ్మ యడుగుకొనున? సాటి ♦ వానిఁ గొలుమనే?॥ 3

అనుపమ సుందర కవితా
వనితను గవిజాతి పరమ ♦ భాగ్యకుమారిం
గనవచ్చునె! నీమగండును
ఘనుఁడా! మొనగాఁడ! పోటికై నిలఁబడునా!॥ 4

నవసాహిత్యమున వివిధ
కవితాస్రష్టులను గనెడి ♦ గంభీరమ మా
నవకోటి కిరీటంబగు
కవికిఁ "గవిబ్రహ్మపదవి" ♦ కలదు వలదనన్॥ 5

ఇహమున నింకొక యఁజూఁడన
సహజప్రియ సుందరాంగ ♦ సారస్వత సం
గ్రహ కవులకు—నీ బ్రహ్మకు
సహమమహమిక-యుండవచ్చు ♦ నా? భాగవతీ!॥ 6

శ్రీమంతానఁగు బేరులైన దొరలన్ ♦ రేయింబవళ్ళందు నే
దో మామూలు ముఖస్తుతింగొలచి యే ♦ దో యింతఁగాఁ జేయ మీ
కీమాత్రమ్మను నెంత నేర్చినను రా ♦ నే రాదయొం గాన ని
స్తోమా ప్తింగనిబ్రహ్మపై గొణుఁగుచున్ ♦ దుఃఖింతువా!సత్కవీ!॥ 7

యతులన్ లక్షణ సార భాగ కఠిన ♦ ప్రాసాబ్ధులన్ దాఁటుచున్,
శతశస్సంధి సమాస దుర్గమములన్ ♦ సాధించి, వేగించి, శా
శ్వత భాషాసువిశాల రాజ్యమునకున్ ♦ సమ్రాట్టువై బ్రహ్మపై
కతిచిల్లాభము లేనిదానికయి చీ ♦ కాకేటికే? సత్కవీ!॥ 8

వచ్చిన డబ్బువచ్చినది ♦ వచ్చిన చందముఁ బెద్ద సంచిలోఁ
గుచ్చి, బిగించి, మూతిఁ గొనఁ ♦ గుట్టకయే కడలేని పోఁకడం
కచ్చితమైన కర్ణుఁడన ♦ గాఁ జనుదెంచిన నీకు నెంతయే
నిచ్చిన లాభమేమి కను ♦ పించదు పాపము బ్రహ్మదృష్టికిన్॥ 9

యాచనఁ జేయరాదు మరి ♦ యాదలతో దొరగారితో సమా
లోచనచేయరాద. చిర ♦ లోక చమత్కృతిఁ గూర్చరాదు. మా
రీచ విచిత్రమాయఁ గుది ♦ రించు కలాపము రాదు బీద వాఁ
డై చనునట్లు వ్రాసిన మ ♦ హాత్ముని దోషముగాదు సత్కవీ!॥10

కతిపయ శుల్క ప్రీతికిఁ
గృతినిఁ గిరాతకుని రీతి ♦ గెంటెడి కవికిన్
హతభాగ్యము గలిగి విధి
కృతమని లెక్కించు స్వీయ ♦ కృతమెద్దారైనన్॥ 11

పాషాణ హృదయులను గవి-
పోషకులని బొగడునట్టి ♦ మూర్ఖకవికి సం
తోషానంతర విరసము
శేషించద? బ్రహ్మపైనఁ ♦ జిదురు కొనుటకున్॥ 12



# వ్యాఘ్రంమన్యులు

---

కలికాల కపటనీతినిఁ
దెలియని బీదలను జేరఁ ♦ దీసి క్రిసుము ~ఁ
దలఁగొరిగిన ధూర్తుఁడు బె
బ్బులినని పొరపడిన యట్టి ♦ మూర్ఖుఁడఁ బడుఁగా॥ 1

గెలిచిన మురిపెమున నొడలు
తెలియక నైతికము మాని ♦ దిఙ్మోఘుండై
వెలకిలఁ బడి సైతము బె
బ్బులినని పొరపడెడి వాఁడు ♦ మూర్ఖుఁడనఁ బడుఁగా॥ 2

కులసతియగు నిల్లాలినిఁ
జలిచీమను నలఁచినట్లు ♦ శాసించుచు నా
వల నీడ్చిన వాఁడై బె
బ్బులినని పొరపడిన యెడల ♦ మూర్ఖుఁడనఁబడుఁగా॥ 3

కలసి మెలసి పనిపాటల
సలుప వలసి యున్న సమయ ♦ సందర్భములోఁ
దలచీదరఁ గొనియెడి దొర
పులినని పొరపడిన యట్టి ♦ మూర్ఖుఁడనఁబడుఁగా॥ 4

పిలువని పేరంటమునకుఁ
బిలిచిన చందాన వెడలి ♦ విందో గిందో
సలుపర! యని బెదరించుచుఁ
బులినని యనుకొనెడి వాఁడు ♦ మూర్ఖుడనఁబడుఁగా॥ 5

# ఘనము

---

నిను నీదండును వెంబడిఁ
గొనెడి పవనమునకు నైనఁ ♦ గూడని పదవిం
గనినావన సందఱిచే
"ఘనమన"ఁబడు కారణంబు ♦ కలదే! ఘనమా!॥ 1

జనసేవావ్రత మేఘబృందమ! భవత్ ♦ సౌహార్ద సేవాపరా
యణతం దన్మయుఁడై గదే! యదుఘన♦శ్యాముండు కృష్ణాకృతిం
జనుపాలో యన నద్వితీయ హితశి♦ష్టావృష్టులం జేయఁ గ
ల్గెను కారుణ్యసుధానిధాన భగవ♦ద్గీతా ప్రథాభూమికన్॥ 2

ఘనకాలమ్మున శ్యామ సుందరుఁడవై ♦ కాంక్షించి నీ వాఫ్రికం
జనుతే "నెచ్చు తిరస్కరింపఁబడి దౌ♦ర్జన్యాల పాలౌదునో!"
యని భీతిల్లకు శ్వేతజాతియు నినున్ ♦ యాచించి చేఁజాపకుం
డినచోఁ ద్రాగుట కేని దిక్కుగలదే? ♦ యెందేని జీమూతమా!॥ 3

జనహిత దృష్టివై అమృత ♦ సంపదలం గురిపింపఁజేసి, జీ
వన ధనమంతయున్ సతత♦వాహిని వారముగాఁగఁ జేయు నిన్
"ఘనమన సార్థకంబగును ♦ గా"యని స్వర్ణ ధనాదికంబునన్
ఘనత వహించినట్టి దొర♦గారికిఁ గొద్దిగ నచ్చఁజెప్పుమా!॥ 4

ఎండను మాడుచుం బరిత♦పించెడి సృష్టిలలామకై నభో
మండల బాటఁ గృష్ణముఖ♦మాల యనంజనుఁ దెంచి కంటికిం
బండుగుఁ జేయునట్టి నవ♦వారిదమా! శిరసావహించి, నీ
దండును వెంటఁగైకొన్న స♦దాగతి నీపరిచారకుం డనన్॥ 5

ఘనమా! నీజలవాటియందదిగో! సా♦కల్యంబుగా స్నాతుండై
ఘనిలుం డెంతొ కృతార్థుడౌ చుంగడుడో♦లాందోళితుండై ఘనా
ఘన రాజాగమన ప్రచారమునకై ♦ కార్యార్థుండై నట్లు జీ
వన సందేశము వీంచెనాంబరుగు నీ♦వార్తా హారుండోయనన్॥6

ఘనమా! సర్వజనాభివందిత పతా♦కా! లోక సేవా నికే
తనమా! నేటి ప్రపంచమందు వివిధా♦దర్శానుసారమ్ము లాం
ఛన లబ్ధాశ్రిత వైజయంతులకు నీ♦ సౌశీల్య సేవాసుధా
ఘన ముంబంచుచుం బొమ్ము నీమధుర సి♦ద్ధాంతంబుల న్నేర్పుచూ!॥7

ఘనమా నేటి యుగాన-విశ్వజన యో♦గక్షేమముల్ కోరి శాం
తిని నాదంబులు జేసి చేసి తుదకున్ ♦ దిగ్భ్రాంతులై పోవు వా
రిని వ్యంగ్యంబున నవ్వెనాక మెఱువుమా!♦ యీపశుపాతమ్ములో
ఘనమా! కొంతయు నైనం గూడదనుచున్ ♦ గర్జించుచుం
జెప్పుమా!॥8

తెల్లని వారలై మిగుల ♦ ధీవరులై తనుత్రోడి వారితో
నల్లని వారిలోంగని వి♦నంబడనట్టి విషమ్ముతోం బ్రవ
ర్తిల్లిన వారు జూచుటకుం ♦ దెల్లని తోళ్ళను గప్పుకొన్న చోం
దెల్లని వారుగాని వ్యవ♦ధిన్ ఘనమా! చెవిలోనం జెప్పుమా!॥9

నినుంగన్నట్టి సముద్రుండో జలదమా!♦ నీసస్య సామ్రాజ్య శా
ఖను జూడందలకెత్తె-నెత్తు కు నా♦కాశ ప్రమాణంబుగాం
జనియెం గన్నులపండుగయ్యెం బిదపన్♦ శాంతించెం గాబట్టి నీ
ఘనతం గావ్యములోన నే-శతనమ♦ స్ఫారంబుగా వ్రాసితిన్॥10

పడుచు వారల దాంపత్య ♦ భావధనము
బాలబాలికా క్రీడా స్వ♦భావధనము
వన మయూరాభినయ హావ ♦ భావధనము
భావనాలోల కవిరాజ ♦ భావధనము
ఘన కుబేరాభి గమన ప్ర♦కరణమగును॥ 11

పరితపించెడి యీసృష్టి ♦ బాలకొఱకు
గరుడ వేగానువేగాన ♦ బరువులేల?
విశ్వసంచారమునకెల్ల ♦ విసుగవేల?
దొంగ దారాలు జూపించఁ ♦ దోఁచ దేల?॥ 12

పరులకై యింతనారాట ♦ పడుదు వేల?
స్వర్గసీమ నివాసంబు ♦ వదల దేల?
సంచితంబును నేలపైఁ ♦ జల్లె దేల?
స్వాతి రత్నకోటిని ధార ♦ వోతు వేల?
దాచుకొని దొంగ బేరాలు ♦ దోఁచ దేల?
దొరలుగా సుఖపడ నీకుఁ ♦ దోఁచ దేల?॥ 13

ఘనమా! యీరఘురామరాజ్యమున సా♦కల్యంబుగా నీవు జీ
వన ధారాధనమైన నీయమృతముం ♦ బర్జన్యరూపాన సే
చనముం జేసినదానికై హిమనగ ♦ స్వారాజ్యమందున్న తా
సన భాగ్యంబు ప్రసాదమానను చుస♦త్సందేశముం జెప్పెదన్॥ 14



# ధన్యంమన్యులు

ఇరువురి గుసగుసలం గను
మఱుఁగున వినునట్టి యొక • యమర్యాదను క
క్కుఱితిం గనఁనీయని కను
పొరలుగొనెడి గుడ్డివాఁడు • మూర్ఖుఁడనఁబడున్॥ 1

ఇరుగుపొరుగు వారినిఁ జీ
పురుపుల్లఁగాఁ దలంచి • మొత్తమునకు నే
దొరనని-యిల్లాలి యెదుట
మురిసిన వాఁడొకఁడు శుద్ధ • మూర్ఖుఁడనఁబడున్॥ 2

పరిమితికిన్ మితిమీఱిన
సరసములను గ్రక్కుయనవ • సరముగ విరస
స్వరమున నే లేఖకుఁడని
మురిసిన ఛాందసుఁడు శుద్ధ • మూర్ఖుఁడనఁబడున్॥ 4



# రవిదృష్టికిచాటు - కవిదృష్టికినేటు

గవి దృక్పథమేనిఁ గనని
భవితవ్య సముద్ర రత్న ♦ భాండారములన్
నవల కథానిధిలో నవ
కవిదృష్టి కలములు జెప్పుఁ ♦ గలఁగని యైనన్॥ 1

రవిదృష్టికి గుహ్యమనో
వ్యవసాయము కంటఁబడని ♦ పక్షములో మా
నవ మానస కలహంసగు
కవికలములు జెప్పవా? య♦గాఢ ప్రతిభన్॥ 2

కడచిన కథలన్నింటిని
గడగడ జెప్పుటకు వచ్చుఁ ♦ గవికలమునకుం
బొడఁగట్టు దంశుమాలికి
నెడఁబాసిన కాలమూర్తి ♦ నిదమిద్ధమనన్॥ 3

పడుచుల కిరువురికి నొడం
బడికయ్యెడి మూఁక భావ ♦ భండారము గ
న్పడదు రవికి-గాని గనం
బడుఁ గవికలములకుఁ బ్రకృతి ♦ పారగతులకున్॥ 4

సరసముతోఁ గనుమఱుఁగున
నిరువురి గుసగుసలలోని ♦ యింగితమును-భా
స్కరుఁ డెరుగఁడు, గాని కవి
స్వరము వివరించుఁ గవి య♦థా తత్త్వమునన్॥ 5

# ఒక్క తల్లి కండలు

హరిహరులేని నేటికి ప♦రస్పర భిన్నగుణానుబంధులై
అరమరలేక యంతటఁ బు♦రాణమతైక్యముతోఁ జరించినన్
పరమ పవిత్ర దేశమున ♦ బంధువులై యొకయింటిలోని సో
దరులన నుండరే? యొక వి♦ధాన సమాగత భారతీయులై॥ 1

ఎండవెనుక నీడ ♦ ఎండకు మునునీడ
కలసి మెలసి యుండి ♦ క్రమము తోడ
నొకటియైన పిదప ♦ నొకటడుగిడుచుండు
వరుస కొలఁది విగత ♦ వైరులగుచు॥ 2

ఒక్కతల్లి కండ♦లో యన నేఁడేని
ఉప్పుతోడ కార ♦ మొక్కటగుచు
వంటలందు నైక్య ♦ ఫలితముఁ జూపించు
పాఠమంచు నేర్వ ♦ వలయునంచు॥ 3

నిప్పును జీవనీయమును ♦ నిర్భరవైరులయ్యున్, శరీరమం
దప్పసమై-మమైకమత ♦ సూత్రికులై నిఖిలాత్మమిత్రులై
చప్పున జీవనమ్మనకుఁ ♦ జల్లని చూపున నుండ నేర్చెన్
ఇప్పటి భారతీయులకు ♦ నేకముఖమ్మున నుందురీకలిన్॥ 4

వెలుతురు కంటఁ గన్పడఁ బ్ర♦వేశమునొల్లనియంధకారమున్
జలజల రాలి యైక్యమయి♦ సంధ్యలలోఁ బ్రియమిత్రులైనచోఁ
జిలుకలనం బవిత్రేతర ♦ జీవులన్ ఋషితుల్య భారతీ
యుల కొకతల్లి కండలన ♦ నుండుటెగాద? చరిత్ర సీమలన్॥ 5

# నీకు నీవె సాటి – నేఁటికైన

---

నీకుటుంబ మందు ♦ నే కవీంద్రుఁ డేనిఁ
బుట్టి పెరిగి నట్లు ♦ బోధ పడదు
కవుల తోడ నైనఁ ♦ గాలయాపన మేని
ఏమొ? చేసినట్లు ♦ నేదె! వేమ?॥ 1

శతసహస్ర మాన ♦ శబ్ద సమాసాల
వల్లె వేసినట్టి ♦ పండితులకుఁ
గోటి కొకరి కేని: ♦ గొంగునఁ బడనట్టి
కవన మేమి? నీకుఁ ♦ గలుగు టేమి?॥ 2

సంస్కృత గతనీతి ♦ చంద్రికాంబను దెచ్చి
చేరఁదీసి తెనుఁగు ♦ చీరఁ గట్టి
ఎట్టయెదుటఁ దెచ్చి ♦ నట్టి కవులలోన
నీకునీవె సాటి ♦ నేఁటికైన॥ 3

మూఁడు వేళలందు ♦ ముండ్ల కంపలనంగ
ఘనసమాసములనుఁ ♦ గట్టిపెట్టి
తేట తెనుఁగు లోనఁ ♦ దేనె లొలుకఁ జేయ
నీకు నీవె సాటి ♦ నేఁటి కైన॥ 4

శుక్రనీతి కేని ♦ సులభ సాధ్యముగాని
వక్రనీతి నైన ♦ సక్రమముగఁ
దెనుఁగు లోనఁ గట్టు ♦ దిట్టము గావింప
నీకు నీవెసాటి ♦ నేఁటికైన॥ 5

"ఆఁటవెలఁదు"లందుఁ ♦ బోటిఁజేయఁ దలంచి
యే కవీంద్రుఁడేని ♦ నెన్నఁడేని
నిన్నుమించు వార ♦ లున్నట్లు గలదేని
నీకునీవె సాటి ♦ నేఁటికైన॥ 6

వృత్తములను బొత్తిగ నీ
వెత్తుకొనక మొదటినుండి ♦ యేకైక విధిన్
మొత్తముపై నాఁటవెలఁది
కత్తెల సాధించుటేల? ♦ కవి వేమన్నా!॥ 7

పెత్తనమున నాఁటవెలఁది
కత్తెల విడనాడి మఱలఁ ♦ గావ్య వనమునం
దుత్తాఁట వెలఁదులని నీ
వెత్తుకొనుట మాకె తెలియ♦దే? వేమన్నా!॥ 8

నెత్తినెరసి పోయిన నీ
పొత్తునఁ బ్రాయమున ముసలి ♦ పోకడలకు నీ
సొత్తనో!-ఆటఁవెలఁది
కత్తెలు కవనమున నైనఁ ♦ గావలయు నొకో॥ 9

వ్యభిచరించినట్టి ♦ వ్యంగ్యమునకు నిన్ను
నాఁటవెలఁది దప్ప ♦ నన్యవృత్త
కన్య యొక్కతేనిఁ ♦ గంటఁ జూచెన? వేమ!
కవన భూమికా వి ♦ కాసమందు॥ 10

ఆఁటవెలఁది యైన ♦ ఆఁడుదానినిఁ బట్టి
పిదప దాని విడిచి ♦ పెట్టెసట్టి
కైతమునకు నీకుఁ ♦ గప్పంబు చెల్లింప
వలసి వచ్చె "నాఁట ♦ వెలఁదు" లందు॥ 11

ఆఁటవెలఁది నంది-అట్టిదానిని విడుచు
కలలు గూడ వట్టి-కలలటంచు
నీ నిదాన కవిత-నిష్కర్ష గాఁ జూపు
తత్రిసాక్షి గాని-దర్శనముగ॥ 12

---

## విశ్వకవులు

---

దుర్యోధన విషపూరిత
చర్యల నాద్యంత ధర్మ ♦ సంగతమని చా
తుర్యముగా నిలుపుట సా
కర్యముగావచ్చు విశ్వ ♦ కవిచంద్రులకున్॥ 1

వైదికమును లెక్కించక
కాదని వాదించి కాంతి♦కై-నవ్యగతిం
బాదును నిలఁబెట్టఁ జతు
ర్వేదములును వడఁకుచుండు ♦ విశ్వకవులకున్॥ 2

పాలితులగు హాలికులను
లేలెమ్మని గద్యపద్య ♦ లేఖలచే భూ
పాలకులఁ జేయవచ్చును
కాలక్రమ నిపుణ విశ్వ ♦ కవిచంద్రులకున్॥ 3

నాలుగు వేదాలైనను
జాలక గాఁబోలు శుద్ధ ♦ సమర కథను నా
మూలముగా వేదంబగు
వీలును బెకలించ వచ్చె ♦ విశ్వకవులకున్॥ 4

పిట్టకథల చేతఁ ♦ బుట్టు మూగల నోటఁ
బంచతంత్రమై ప్ర ♦ పంచమునకు
రాజనీతులన్ని ♦ రాఁజేయ వీలౌను
విశ్వకవులకున్ స ♦ విస్తరముగ॥ 5

రానున్నట్టి కథాప్రసంగమున శ్రీరామావతారంబు లోఁ
గానున్నట్టి విశిష్టనాయకుఁడు లం♦కాకాండ సంగ్రామ పా
రీణుండౌనని–ఆదివిశ్వకవి నాఁ♦డే నేఁటి రామాయణా
ఖ్యానంబంచు వచింప సాగెను భవి♦ష్యత్ జ్ఞాన పారీణతన్॥ 6



# విద్యార్థి పరిదేవనము

వెలవెల వోయినట్టి బడి ♦ పిల్లఁడ ఎక్కడనో పరాయి పం
చల బసఁజేసి ట్యూషను ప్ర♦సాదముఁ బొందక నేఁడు, ఫేలుగా
వలసిన కారణాన నలు ♦ వైపులఁ జూచుచు మూలనొకడన్
వలవలయేడ్తు వేల? యిది ♦ పాపయుగంబనఁ దథ్యమేగదా!॥ 1

నెలల కొలంది నేమియును ♦ నేర్వని మూఁదులు పాఠశాలయం
దలి యొక పంతులింట నెల♦దాక మహాభయభక్తితోడఁ గా
వలిఁ బడియుండి ట్యూషను ప్ర♦భావముచేతఁ బరీక్షలందు నా
వలఁ బడినట్టి ధూర్త ధన♦వంతుల పిల్లలఁ జూచి యేడ్తువా?॥ 2

పంతులు జెప్పినట్టి బడి ♦ పాఠము లన్నియు వల్లెవేసి, నో
రంతయు నెండిపోయినను ♦ ఆఖరు-ఫేలయినట్టి మాయకై
స్వాంతము వెళ్ళి నేఁడుతల ♦ పంతులుకెంతయు నచ్చఁజెప్పి నీ
వెంతయు నేడ్చినన్ ఫలిత♦మేమియులేదని యేడ్చుచుందువా!॥3

తరగతిలోన నందఱు కృ♦తార్థులు కారుగదా! మఱేమి! కొం
దఱుసరె. మంచివారయిరి ♦ తక్కిన కొందఱు పంతులింట న
క్కఱఁబడిఁ యుండినట్టి యధి♦కారులె! ఫేలగు టెట్లు? ని
వ్వెరఁ బడఁబోకు ఫేలయెడి ♦ పిల్లలు మీరలె బీదలే గదా!॥4

వారలు పెద్దవారలకు ♦ బందుగు లౌదురు గాన నీదు రా
చారము సాగెనంచు నవి♦చారముచే మొఱఁ బెట్టుకొన్న నో
వారలు పక్షపాతమునఁ ♦ బంతులుకై నినుఁ బిచ్చివానిగా
దూరముఁ ద్రోసినన్ మఱొక♦దుఃఖము పాటిలునంచు నేడ్తువా!॥5

వ్యాస సమానమైన తల ♦ పంతుల మాయికఁడయ్యెఁ గానఁ బే
రాసకుఁ బోయి పాఠక మ♦హాశయు లిట్టి పరీక్ష వేళలం
గాసుల కమ్ముకొంచు నధి♦కారి యనుజ్ఞయు లేక ట్యూషనల్
జేసిన వారు న్యాయమును♦ జేయర? నమ్మవ? బాసలాడినన్॥ 6

ఇరువది మంది పిల్లలను ♦ నింట కుదించినవారు, క్రొత్తఁగా
తరగతిగాఁ దయారయిన ♦ దాని కఖండ దయార్ద్ర దృష్టికిన్
సరిపడు నట్లు రేఁబవలు ♦ సంచిత శక్తిని ధారఁబోయ నం
దఱుఁ గననట్లుఁ జేసికొను♦ దైన్యముపై విలపించుచుందువా?॥7

వారలు పెద్దవారు ప్రభు♦వర్గ ధురంధరులౌట వచ్చినన్
నూరు విధాల దీనినిఁ గ♦నుంగొన నేర్తురు? నేర్చియుండినం
దీరున? తీరినం గ్రమవి♦ధిన్ "దరఖాస్తు గుజారు"లన్నఁ జే
కూరక వచ్చునట్టు లది♦గో! చనువారలపైన నేస్తువా?॥ 8

వీరలు పిల్లవాండ్రు, విల♦పించుట దప్ప మఱేమి చేయలే
రైరి. నిజమ్మె గాని యక♦టా! బడులందును బూజ్యమైన ప్రా
కారములోన ట్యూషను వి♦కార పిశాచము నేఁటి లంచమై
చేరియు లోకమేమియునుఁ♦ జేయని పాపము పైన నేడ్తువా?॥ 9

నవ్య యుగానుగుణ్య-నవ♦నాయక సభ్యులు, రామరాజ్య క
ర్తవ్య పరాయణక్రమ ధు♦రంధరులై చనినారు గాన నేఁ
డవ్యయ శాంతి మూలధన ♦ మంతట నిల్చునటంచు భావనా
దివ్యముఁ గోలుపోకుము! య♦థార్థధనంబది నమ్ముమా!
మమున్॥ 10

కలికాల మూర్ఖులకు నా
వల తలములు కోదువగలవ? ♦ పరమ పవిత్ర
స్థలియగు తెలంగాణమె కా
వలెనా? యని యడుగవేల? ♦ భాగ్య నగరమా!॥ 11

ఇక్కడ వీరలాసలు త్య♦జించిన వారయి, పాఠశాలపై
ముక్కలు విర్చియొంతయుఁ బ్ర♦బుద్ధులుగాక ప్రశాంతమార్గముం
బ్రక్కకుఁ ద్రోసివేసి పెడ ♦ బాటకుఁ బోవర? పూజ్యపాఠకా!
చక్కని రామరాజ్య నిజ ♦ సంపదఁ జెడకుండఁ జూడవా?॥ 12

అక్కడ వారు పాఠక ర♦హస్య దయం బయికెక్క లెక్కలుం
బ్రిక్కలు నేర్వకుండ, బడి♦ పంతులటన్నఁ దిరస్కరించుచున్
రక్కసు లౌచు నంతట 'అ♦రాజకపుం పొడఁబోర'? నేఁడు నీ
చక్కని జేజెలుం జెడిన♦సంగతిఁ జూడుమ! రామరాజ్యమా!॥ 13

అనుమతి లేక ట్యూషనల ♦ నందిన వారలపైనఁ జర్యఁ గై
కొనఁ బ్రతిసారికిన్నియమ ♦ కోటి తయారయెఁ గాని యుక్తిల
క్షణమణులన్ ముఖస్తుతి వి♦శారదులం గలలందునో నిబం
ధనబలమొత్తఁ బోదదియ♦థార్థముమా తెలంగాణ వేదికన్। 14

నక్కెత్తున 'గుప్పు చుప్పు'న
నొక్కొక్కఁడు నూర్లకొలఁది♦ నొసఁగినచో యీ
పుక్కసతర ధనలాభ
మ్మక్కర లేదంచు-ధైర్య♦మా! తోడ్పడవా?॥ 15

---

# మార్లవాయినుండి సరస్వతికి లేఖ

అమ్మా! నేనొక్క యువస
రమ్మున నీకొక్క యుత్త♦రమ్ము నమస్కా
రమ్ములతో మొదలిడి విష
యమ్మును దెలిపెదను నీదు ♦ హత్తర సేవన్॥ 1

భావైకైక మహాశయాంధ్ర కవితా ♦ బాలాలలామా! భవత్
సేవా క్షేత్రములోనఁ బంపుఁడని నే♦జింతామణి ప్రక్రియ
శ్రీవారిన్ 'దరఖాస్తుఁ' బెట్టితుదకుం♦జేమోడ్చుచున్ వేఁడినన్
మావారయ్యును మమ్ముబీదకవులన్♦మన్నించిరే? శారదా!॥2

భావప్రాణ సరస్వతీ! జగతికం♦బా! నిన్ను నేనమ్మి,–భా
షావంశావళి వారలం గవులకున్ ♦ సంతాన సంకాశులన్
దేవా! దేవ! యటంచు గడ్డిఁదినుచున్ ♦ దీర్ఘ ప్రణామమ్మునం
ద్రోవం దప్పితినట్టి వక్రగతికిన్ ♦ దోషంబు నీదేటికిన్॥ 3

యావద్భాషనుఁ గన్నవారమయి యం♦బా! బట్టకుం బొట్టకున్
వైవశ్యంబున నేఁటికీకొలువునం ♦ బ్రత్యక్ష దైతేయులన్
మావారంచు,దయార్ద్రులంచు, మముస♦న్మానింతురోయంచు నే
ద్రోవందప్పిన తప్పుకై భగవతీ! ♦ దోషంబు నీదేటికిన్॥ 4

శ్రీలం బంచెడి లోక నాయకునకుం ♦ జేఁదోడువై, వానికి
ల్లాలై నీకును నేఁటికేని నిదిగో! ♦ యస్వస్థులై లేమిలోఁ
గాలక్షేపముఁ జేయునట్టి కవులం ♦ గాపాడ రానట్టి నీ
వ్రాలన్ మాకనుదిద్దరాదుగద! యం♦బా! నమ్ముమమ్మోయొషన్॥5

మునులం బోలినఁ గానియీకవిత-ఆ ♦ మూలాగ్ర సంజీవనీ
ఖనియై, మానినియై, మహాసుభగయై, ♦ కన్యాసమంబై, నిరం
జనమై, శాశ్వతమై, యశఃపటహమై, ♦ ఝంకారిణీ వేగ వా
గ్ధసమై వశ్య వచస్కృతం గవికి సా♦ధ్యంబా గదే! శారదా!॥6

వాణిం జేతుల నుంచునట్టి కవియై ♦ వాగ్దేవతా రూపముం
దానేయయ్యెడి మేటియై కొలువునన్ ♦ "దాసోహమ"న్నట్టిసం
స్థానం బందున రాఁడు గాని తన సం♦తాన ప్రియాసంబునం
బ్రాణాలన్ బిగఁబట్టి వచ్చినను రా♦వచ్చుంగదే! భారతీ!॥ 7

వరి యన్నంబునుఁ గోరినట్టి యెడలన్♦బంగారు యన్నంపు వి
స్తరి వడ్డింప-నయోమయ స్థితికిఁ జిం♦తాక్రాంతుఁడై నట్టుల
య్యారె! నేనాంధ్రుఁడ నీమరాళిబడి క♦ధ్యక్షు ప్రకాశాన ని
త్తఱిఁ బంపం బడినాఁడఁ జూపరుల క♦ స్తవ్యస్త దృశ్యంబనన్॥8

అమ్మ! దుకాణమన్న నొక♦టైనను లేదయెఁ గాన నుప్పుతోఁ
దొమ్మిదిఁ దెచ్చుకొమ్మనెడి♦దుఃస్థితిఁ జూచుటకేని నేఁడునిన్
రమ్మని వ్రాతు నీనరక ♦ రంగ సమానక మార్గవాయి స్థా
నమ్మునుఁ గుర్చి గీతలను ♦ నాకయి నీపతి దిద్దునో! సతీ!॥ 9

అమ్మా! నీపెనిమిటి దా
స్యమ్మును మముఁబనిచి కష్ట♦సంఖ్యా బాహు
ళ్యమ్ము నకున్ శీలము మే
మమ్ముకొనెద మనుచు నమ్మి♦నట్టి దొరయయెన్॥ 10

బయ్యలగా గణింపఁ బడు♦వారది-"ఆదిమ వాసు"లెరిత్రోఁ
గయ్యముఁ జేయఁబోరు నిజ♦కార్య పరాఙ్ముఖ జాతిగాని బా
బయ్యలు శాంతమూర్తులు♦పౌరులు. పేరునఁ గొండ జాతులై
యియ్యెడ మార్గమాయిన వసించిరి సుస్థిరతన్ సరస్వతీ!॥ 11

నిన్నటిదాక మెచ్చుకొని ♦ నిందు దయన్ బడినాజరైన నం
గన్నులఁ గప్పుకొన్న యధి♦కారు లొకుమ్మడిపొంగిపోయి నేఁ
డన్నముఁ జేయరంచు మరి♦యూదకు నమ్మెద నంతెగాని నీ
వున్నది యున్నయట్లుఁ గను♦మో సరస్వతి! దివ్యదృష్టితో॥12

"నాపాపంబేమని చేఁ
జాపి యడుగ-"నేమిలేదు. స్వామీ" యన న
ద్దాపకమున దొరవారల
పాపపు దౌర్భల్యమే జ♦వాబై నిలిచెన్॥ 13

కలుష మనస్కుఁడై యొకఁడు♦గారడివాఁడన-న్యాయ వేదికన్
నిలఁబడినట్టి రోజులు క♦నీసము ముప్పది రోజులేవి-స్వ
స్థలమునఁ-గార్యదక్షుఁడన ♦ సంతక మొత్తిన వానిఁబట్టు ఓ
నలువపడంతి రిక్తపరి♦ణామ ఫలంబు బిగించి యీకడన్
నిలకడఁ జేయఁబంపఁబడ♦నేమను కొందును చెప్ప వేటికిన్॥14

ఇటువంటివి కొన్నిటి దు
ర్ఘటనల నేఁబట్టినాను♦ గాని కొలువు లో
పట నుండి నియమముగ నొ
క్కటియు న్నికేనిఁ జెప్పఁ♦గలనే! దేవీ!॥ 15

తెనుఁగు బడుల లోనఁ♦దెనుగుఁ జెప్పెడి వారు
కొదువటంచుఁ జెప్ప♦కొనెడి వార
లీ మరాఠి బడికి ♦ నేరేరి నను బంప
శారదాంబ! కంటి ♦ నీరు గారు॥ 16

ఇంకను కాన్పిడెన్నలన ♦ నేల? విశీల మనుష్య కోటినో
వంకకు రూఢనీతి పరి♦భాషకు నీడ్చి బిగించి నేఁటికిన్
బింకము లుడ్గఁజేయ వెను ♦ వెన్కకుఁ బోయిన పెద్దవారలో
వంకకుఁ జర్యఁ గైకొనని♦పాపముఁ జేయుచు నుందురో సతీ!॥17

---

## పురుషార్థింమన్యులు

---

పరిణామ ఫలంబెఱుగక
కరకరఁ గోసినను గూటి♦కై బావలపై
విఱిగి వదలనట్టి మఱఁది
పురుషార్థింమన్యుఁడైన ♦ మూర్ఖుఁడనఁబడున్॥ 1

కరువునఁ గాటకమున సో
దరుఁడే భారమ్మటంచు ధైర్యముతో ని
ద్దరి భార్యలఁ జేసికొనిన
పురుషార్థింమన్యుఁడొకఁడు ♦ మూర్ఖుఁడనఁబడున్॥ 2

సరసమునకు శోభించెడి
చిరునవ్వును పూలి–రెండు ♦ చెవులన్ ఛేరిన్
సరిఁదూఁగఁ గూల నవ్వీన
పురుషార్థం మన్యుఁడొకఁడు ♦ మూర్ఖుఁడనఁబడున్॥ 3

సరస విషయ సీమామృత
ఝరి సమ గమనమును మాసి♦జలధిసమ భయం
కర ముఖుఁడై గర్జించిన
పురుషార్థం మన్యుఁడొకఁడు ♦ మూర్ఖుఁడనఁబడున్॥ 4

పరమార్థ విచార పరం
పరలను–సాయించి స్వార్థ♦పరుఁడై తానే
బురదన్ దిగఁబడిన యతఁడు
పురుషార్థం మన్యలోక ♦ మూర్ఖుఁడనఁబడున్॥ 5

విమవారు లేనిసమయ
మ్మున నాత్మస్తోత్రి రాగ♦మును విసుఁగెత్తన్
వినిపించెడి మురిపెమ్మున
మునిఁగిన గాయకుఁ డొకఁడు ♦ మూర్ఖుఁడనఁబడున్॥ 6



# ఆడుబిడ్డల సొత్తున కాసపడిన మీసము

— —

కాసె బిగించి బావసహ♦కార మృషం జనుదెంచి కన్నులన్
మూసి, సహోదరీ ధనము♦ మోసిన దొంగల మూతిపైని యో
మీసములార! మిమ్ముగత♦ మీసము లెంతో పరాచకాన-నే
రాసికిరాని పీచులని”♦ రట్టడిఁ జేసిన రోషమేటికిన్॥ 1

తెక్కలులేవ! తిట్టినను ♦ రేషము లేవ? స్వతంత్రి జీవనం
బక్కఱలేద? స్త్రీలును స్వ♦యం పురుషార్థులు లేర? మూగలై
కుక్కలు సైతముం బిడుచ♦కోసముఁ గావలిఁ గాయుచుండగాఁ
పుక్కిపు కూటికాసపడఁ♦ బోకుమ! మీసమ! యర్థశుద్ధికిన్॥2

బావం జెల్లెలి నెల్లదోఁచు కొనుటో♦ వ్యాపారమా? నిన్ను నీ
నీవారైనను దూరరా? వినవ? యీ♦నిర్వీర్యమెన్నాళ్ళు? నీ
జీవాత్మెందును రోసిపోయి, యిఁక “యీ♦జీవచ్ఛవాకార దు
ర్దైవ ప్రాణికి మీసమా”యనిన నో♦ప్రత్యుత్తరంబుండునా?॥3

మానములేక బావకు స♦మానముగా సుఖభాగులైన యీ
ప్రాణులు చచ్చియేని బహు♦ బాధక భూత పిశాచ కోటియై
ప్రాణము బీకరా? భయమ?♦బావకు దూరము నుండనేర్చిరా?
ఔను“ఒరేదురాశ!”అపు♦డైన సరే యిఁకఁ జెప్పనేటికిన్॥4

ఆఁడుబిడ్డలఁ దెగనమ్మి♦ నట్టివారు
మేలు మీకన్న వేరెట్లు♦ మేలు మేలు
గాని కన్యాశుల్కమా! ♦ దానికన్న
నెన్నియో రెట్లుడబ్బు మీ♦యింటఁ జేర॥ 5

అత్తారిం జేరిన ఓ
బత్తెమ! లోకాపవాద ♦ భయమన నీకై
ఉత్తది. సదుపాయమనన
ముత్తది, ఆత్మాభిమాన ♦ ముత్తదయి చనెన్॥ 6

ఒల్లన బావకుం జెవుల♦నూది, కులాసగ వాని జ్ఞాతులన్
గిల్లి, క్రమేణ నందజేసి♦ గెంటిన వాఁడ! స్వరాజ్య మంచు చి
న్నల్లుని యిల్లుఁజొచ్చి, సమ♦యంబును వేఁచి, తలాపునుండి ఓ
ముల్లెను మోయలేద? యిఁక♦ మోయవలోకము గుడ్డిదందువా? 7

మెట్టుకు నొకమాటన్నీ
మట్టుకు నడుగుదున? బావ♦మఱఁదులకై రాఁ
బట్టఁ బడెఁ? యీకర్ణుఁడు
పుట్టెన? నీదండు నెల్లఁ ♦ బోషించుటకున్॥ 8

'కప్ప'-మన్నట్టు లట్టెడ ♦ బొప్పచుండె
"అసలు" కేఁటేటి లాభమ♦న్నట్లు దోఁచె
ఆఁడుబిడ్డలపై "పన్ను"♦ లట్లుదోఁచెఁ
జౌను కష్టార్జితము కాని ♦ యట్లుదోచె॥ 9

మచ్చునుఁ జల్లి-వానిని స♦మగ్రముగాఁ దలఁగొట్టి నీవు నీ
యిచ్చకు వచ్చినట్టు లెగి♦రించిన మిమ్ము జనాబ-నోటికిఁ
వచ్చిన యట్లు దూరద? ప్ర♦పంచము గుడ్డిద? మూగదా! అదే
బిచ్చమొ! కూలినాలియొ ల♦భించద? వెళ్ళద! కష్టమందువా?॥ 10

అల్లుని నెల్ల దోఁచుకొని♦ ఆర్థిక రక్తపిపాసువై కడుం
దెల్లని దుస్తులందు విర♦తి ప్రతిబింబితవాగ్విధిన్ విరా
జిల్లిన ధూర్తరాజ! సెల♦యేటి కరేట జపానికేని నీ
వల్లఁ బ్రతిష్ఠ వచ్చునని♦వ్రాసెను. దానికి-బ్రహ్మయీకలిన్ ॥ 11

పాప ఫలంబు లేదనెద♦వా? భవదీయులు బావనెత్తిపై
దాపరమైన రప్పలయి ♦ దండుకు దండయి-తిండిపోతు వా
రై పడి మిడ్కియుండిన ర♦హస్యము జెప్పుదునా? అదంత నీ
పాప ఫలంబు గాద! వివ♦వా! చెవుడా! విననట్లుఁ జేతువా! ॥ 12

భారత లోక కీర్తి ధన♦వంతులలో బ్రతివ్యక్తియున్ సదా
చారసమేతుఁడై విబుధ♦శాఖయి-యంతట స్వావలంబియై
"షేరయి హిందుగా" ననఁగ♦సింహ కిశోర సమానవాచు బం
గారపుమూర్తియై భరత♦ఖండ యశఃప్రతిష్ఠెం చనున్ సఖా ॥ 13

భారత ఖండమందుఁ బ్రతి♦ వాఁడు స్వయం పురుషార్థసార సం
సారి యితండనన్ సకల ♦ శాంతి సమేత కుటుంబ మంద సా
ధారణుఁడై మహాత్ముఁడయి ♦ తల్లికిఁ దండ్రికిఁ బేరుదెచ్చి గం
భీర మనోధనంబునఁగు♦ బేరుఁడనం జనుదెంచు మిత్రమా! ॥ 14



# అక్కడక్కడ



## ఖండకావ్యము

(రెండవ భాగము)

# మ న వి

అస్పృశ్యతా నివారణ రంగమున, నపూర్వ సాహస ప్రదర్శనముఁజేసి చూపించి నెగ్గించు కొనిన శాసనమునకు, దేశనేతృగణ ప్రబోధకవిలేఖిని సహకారము, గావలయునని భావించునట్టి వారలలో నేనొకఁడఁగాన, మద్యథాశక్తి-

శ్రీశ్రీశ్రీ భారతదేశ శాసన సువాసిని దేవికి-
ఆదరాభిమాన పురస్సరముగా సమర్పించిన యట్టి-యిట్టి
కవితాభిరామ ఫలపుష్పములు గ్రహింపఁబడుఁగాక.

ఇట్లు
సేనాపతి
విజయ సం॥ గోకులాష్టమి.

---

# విషయసూచిక



# అక్కడక్కడ

## ఖండకావ్యము

### (రెండవ భాగము)

—:◆:—

### పుణ్యభూమిలోని పాపము

కడు బీదలైన మాలల
కడగండ్లను గండ్లఁదెరచి ♦ కనుగొనవా? ఓ
ఎడఁదెగని బుద్ధిమాంద్యమ!
కడముట్టవ? పుణ్యలోక ♦ కలుష మయెదవా? 1

పడమట యెడలేనిది యీ
కడ నే యస్పృశ్యతంచుఁ ♦ గనఁబడెడి హాడా
వుడిలోని శుష్కదంభమ!
కడఁదోలఁగవ? ఆర్యధర్మ ♦ కలుష మయెదవా?॥ 2

కడజాతులకున్ దిక్కె
వ్వఁడు లేఁడని వారినెల్లఁ ♦ బంచములని గెం
టెడి ఘోరదురాచారమ!
కడముట్టవ? ఆర్యకీర్తి ♦ గౌరవసీమన్॥ 3

కడుపేద కాపురమ్మునఁ
గుడిలిం బడినట్టి యెలుక ♦ కొట్టుకొనిన కై
వడి వీరుమాలవారలు
కడఁ గన్నుంజూడఁ బడర! ♦ కలకాలములన్॥ 4

ఘన జపధనసాధనమున
శనియును విడనాడుగాని ♦ జటిల సమస్యే
వెనుఁదీయని యస్పృశ్యత
కొనముట్టదె? గుడ్లగూబ ♦ కన్ మితియుండన్॥ 5

అణఁచినచో మాలలు చ
చ్చిన పాములరీతి బ్రతికి ♦ సిరికులముల చం
కన నుందురంచుఁ జేసిన
మనకు నదియె నేఁటికేని ♦ మచ్ఛాయనఁ జనన్॥ 6

మనుసంప్రదాయ హారిజన
వనమా! అగ్రజులు మిమ్ము ♦ వాత్సల్యమునం
గనుగొనని పక్షమున శా
సనము వెనుకఁ జనదు నీకు ♦ సాయపడుటకున్॥ 7.

మలమలమాడెడి బీదల
తలఁగొట్టుచు వెట్టిఁ గొనెడి ♦ దైత్యులకా? యీ
పలుచని వేదాంతమతము?
తలకెక్కున? శాసనంబు ♦ దయఁ జూపని-చో॥ 8

# దౌర్భాగ్యరేఖలు

కొండంతటి చలికాలపు
గండములో పుండువంటి ♦ గడియలలో మే
నిండారఁ గప్పుకొనుటకు
నుఁడని దౌర్భాగ్యరేఖ ♦ లుంచిన కొలఁదిన్॥ 1

రెండంతస్థుల మేడం
బండుకొని యెఱుంగనట్టి ♦ పంచమ తతికిన్
ఎండ న్నీడ న్నిలుచుట
కుండన్ గుడిసేని లేక ♦ యుండిన కొలదిఁన్॥ 2

పెండంబెంటన్ దినమొక
బండెడి చాకరినిఁజేసి ♦ బ్రతికెడి ప్రజలే
చండాలురుగా దూర
మ్ముండెడి దౌర్భాగ్యరేఖ ♦ లుండిన కొలఁదిన్॥ 3

ఒరికాలి తీపుచే దు
ర్భర బాధను గట్టిపెట్టి ♦ బదులు బలముతో
దొరలింట వఁతువంతున
నుఱికెడి దౌర్భాగ్యరేఖ ♦ లుంచిన కొలఁదిన్॥ 4

"తప్పంతయు మనదే" యని
యొప్పుకొనిన యెడల మనకు ♦ నింకొక తప్పుం
దప్పున? యితిహాసకథలు
చెప్పవ? మీ యంతరాత్మ ♦ చెప్పక యున్నన్॥ 5

ధసికుల కడపలఁ గాచెడి
శునకమునకు నైనఁ గలుగు ♦ సురుచిరమగు భో
జన సదుపాయము మాలల
కొనఁగూడని మాలదోష ♦ ముండు మనసయిన్॥ 6

# మాతృదేశబాంధవభాగధేయము

అనుకొనఁ బడెడీమాలలఁ
గనినట్టి వకృతి విశాల ♦ గహనతర గుహాగ్
ఘనులును జనినట్టి కథా
ఖనులను ద్రోయుటకు గుండె♦కలదే? మనకున్॥ 1

ఘన పుణ్యా రాసులమ్మని
యనుకొను వారేని-వారి ♦ నంటఁ దగనివా
రనఁ బడరే? బంధువులని
వినివన్ వినకున్న నేమి? ♦ విపరీతమునన్॥ 2

హిందుస్థాన సనాతన
మందిరమున నందఱున్ స♦మాన సమాన
స్కందులుగా హైందవులై
బంధుగులై యుండితీర ♦ వలయుఁ జరిత్రన్॥ 3

నందన వనమునఁ-బచ్చని
పందిరిలో సామ్యక్షేమ ♦ భాగస్థ యశ
స్స్కందులుగా హైందవులై
బంధుగులై యుండి తీర♦వలయుఁ జరిత్రన్॥ 4

రారాను నాటి కృత్రిమ
వైరము చిన్నలను బాడు♦పంచము లనుచుం
గూరాకుం జిచివేసిన
తీరున దూరానం ద్రోసి వేయం దొడంగెన్॥ ౫
సరి! యట్లులైనను వారం
దఱికిం బంచిచ్చినట్టి ♦ ధనమేది యనన్
ఉఱిం బెట్టుకొనిన వదలని
మురికిని "యస్పృశ్యతంచు" ♦ ముడిగట్టం బడెన్॥ ౬

---

## గట్టిపాదు

---

సీ॥ గట్టిశిలలు తోడం ♦ గట్టంబడిన యట్టి
గుళ్ళు గోపురములు ♦ గూలెం గాని
శౌర్యజన్యంబైన ♦ సామ్రాజ్య రంగాలు
కోలాటములనాడి ♦ కూలెం గాని
ప్రకృతి గర్భస్థ శై♦వాలినులును గొంత
తాఱుమాఱైనట్లుం ♦ బాఱెంగాని
పీఠభూములును గం♦భీర సముద్రాలు
కొంత మార్పును దెచ్చు ♦ కొనినం గాని॥

తే॥గీ॥ మనుజ బృందములో నిట్టి ♦ మార్పులేమి?
శీలవంతులు సైతమ ♦ స్పృశ్యు లేమి?
ఆర్యులందీ యనార్య ఛా♦యాంక మేమి?
పుణ్య లోకాన నీపాప ♦ ముండు టేమి?

ధర్మ సంస్థాన మందీ య♦ధర్మ మేమి?
నేఁటికీ దురాగ్రహ మింక ♦ నెగ్గుటేమి?
సత్య శీలులకీ ఘోర ♦ శాపమేమి?॥ 1

గుడ్డగూఁబలేనిఁ ♦ గొన్నాండ్లు జీవించి
కనులు మూయుటైన ♦ కలదుగాని
అట్టి కృత్రిమమున ♦ కాయుష్య మర్యాద
లేద! లేక సిగ్గు ♦ లేనె లేద!॥ 2

భరత ప్రవరుం డేలిన
పరమ పవిత్ర ప్రదేశ ♦ భాగ్యములో స
క్కఁజ మూలిన ఛాందసమా!
చోరబడితివ? నాఁడు దొంగ ♦ చుట్టరికమునన్॥ 3

దురిత దురాచారములను
బరిమార్చిన పూజ్య భాగ ♦ వత ధర్మమ! యీ
హరిజనులనె యేలవ! యీ
సురలోక సమాన దివ్య♦శోభా సీమన్॥ 4

అల పట్టణముల విడిచిన
కలవరమునఁ బల్లెటూళ్ళఁ ♦ గలను కలననన్
వలగొనిమెడి ♦ యస్పృశ్యత!
"తల ప్రాణము తోఁకఁజేర ♦ దా." యనఁ జనుమా॥ 5



# ఎగతాళి

పరమతము స్వీకరించిన
హరిజనుఁడే నేఁడు స్పృశ్యుఁ ♦ డై "హాల్లోమి
స్టరు" యైన యెడల నడుగుదు
రిరుగు పొరుగు వారు మనల ♦ నిది యే మనుచున్॥ 1

హరి భక్తి౦మన్యులు శ్రీ
హరిజనులను గడకుఁ ద్రోయు ♦ నట్టి విషయముం
జిరు నవ్వుఁ బలికించెద
రిరుగు పొరుగు వారు మనల ♦ నిది యేమనుచున్॥ 2

నిరుపేదలైన వారగు
హరిజనులను నేఁటికేని ♦ నస్పృశ్యులలోఁ
దఱిమినచోఁ బలికించెద
రిరుగు పొరుగు వారు మనల ♦ నిది యేమనుచున్॥ 3

పరులు పరిహసింతురు శ్రీ
హరిజనులను జిన్నఁబుచ్చి ♦ అంతట మేమే
పురుషోత్తములని మురిసిన
వారలన్ శుష్కాభిమాన ♦ దోషమ్ము నకై॥ 4

పరులెత్తిపొడుచు చుందురు
సిరిసంపద వారియాజ్ఞఁ ♦ జిత్తంబంచున్
శిరసావహించువార
క్కఱఁ బడని కులంబులోనఁ ♦ గట్టిన మనలన్॥ 5

ఒక్కింటి సాంప్రదాయము
పెక్కగు కులగోత్ర వర్గ ♦ భీభత్సమునం
జెక్కు చెదిరి చెడుచుండఁగ
ఫక్కునఁ గూలంగ నవ్వఁ ♦ బడుదుము నేఁడున్॥ 6

## ఇతిహాస గర్భము

కడజాతులలో మాలలఁ
బడఁద్రోసిన నిర్వివాద ♦ పాపమునకు మీ
రడుగఁ బడుదురో? రాఁబో
యెడి కాలములోని క్రొత్త ♦ యితిహాసమునన్॥ 1

కడజాతులగా మాలలఁ
జెడఁగొట్టిన పాపమంత ♦ శ్రీవారలకే
మెడఁబడదా! యితిహాసం
బడుగద? మిము వదలి వేయు ♦ నా! భయపడునా!॥ 2

కడజాతులందు మాలలఁ
బడఁద్రొక్కిన పాపమునకుఁ ♦ బ్రతి ఫలమని నాఁ
డెడఁదెగని దాస్య శృంఖల
మిడిమేలపు దయ్యమనఁగ ♦ మెడఁబడి యుండెన్॥ 3

శాంతి క్షేత్రమునకు వి
శ్రాంతి స్థాన ప్రశస్త ♦ జనమా! నీవా
సాంతముగా దిద్దిన వి
శ్రాంత జనమనంగ జరిత ♦ కథల నిలుపుమా!॥ 4

ఆముష్మిక సంబంధ
శ్రీమంతుఁడు లెక్కఁగొనఁడు ♦ చీటాఁకులపై
సామాలన మడిమైలల
నేమాలను, మర్త్యలోక ♦ సియ్యాయావళులన్॥ 5

మీమీ మడి మైలలనిన
నేమములీ మాలవారి ♦ నీడన్ యోగ
క్షేమము చెడిపోవ ♦ నదో
నేమమ? ఛాందసమ! స్వీయ ♦ నిందయనఁ జనన్ 6

మనుజులు జేసిన పాప
మ్మున మాల కులాలలోన ♦ మునిఁగెదరని వాఁ
కొని నట్టి పూర్వగాథా
ఖని కర్మ విపాక రేఖ♦కలదో లేదో॥ 7

మనవారలు నాఁడేదో
పనిఁబడ నవ్యాతి నవ్య ♦ పంచమ వర్ణం
బును గల్పించిన గాథా
ఖని కర్మవిపాక రేఖ ♦ కలదో లేదో॥ 8

వినయ విధిజ్ఞత చేఁ దా
మణఁగి మణఁగి యుండినట్టి ♦ యస్పృశ్యుల నిం
కణఁచినచో మన నైతిక
ధనలోప చరిత్ర–కష్ట ♦ తరమగు చుంకెన్॥ 9

# మీతో కొంత విచారవినిమయము

సూచన:—(శ్రీ దాశరథీగారి ప్రోత్సాహసౌహార్దమునకు మత్ప్రథమ కృషి
నమస్కృతిగా వ్రాసిన గేయమిది.)

మాలలార! యభి ♦ మాన ధనముతో
సకలశుభోదయ ♦ శాంతిమతముతో
అన్యోన్య తర మ♦త్యైక్య బలముతో
భారత సేవా♦భావ గరిమతో
అందఱితో బ్ర♦హ్మానందముతో॥
కలవండీ స ♦ త్కాలక్షేపము
జేయండీ మీ ♦ స్నేహ సంపుటము
కొనిరండీ స ♦ ద్గుణ సందోహము
జూపండీ పరి ♦ శుద్ధాచరణము
కనఁబఱచండీ ♦ కనుఁ దెఱవండీ॥
మేలుకొనండీ ♦ మేలుఁగొనండీ
భయపడకండీ ♦ పడిపోకండీ
పరులకు సింహ ♦ స్వప్నము కండీ
నందనవన సమ ♦ నవ భారతమున
రచనాత్మక కా ♦ ర్యక్రమ–మనమున॥
భూసేనా సే ♦ వా సాధనమున
నవభారత సై♦న్య క్షేత్రమ్మున
ఆర్యధర్మ క ♦ ర్మాదర్శనమున
హైందవ బాంధ ♦ వ్యారాధనమున
భారతీయ సం ♦ బంధ బలమ్మున

ధనమే మీరై ♦ మీరే ధనమై
బలమే మీరై ♦ మీరేబలమై
అంతట మీరై ♦ మీరంతటనై
ఎటుజూచిన మీ ♦ రే పూజకులై
మీరు మాలలని ♦ వారు పెద్దలని॥

దూరముండియే ♦ తీరవలయునని
లేనిపోని యే ♦ వో నేమాలని
పంచములై మీ ♦ వారున్నారని
వ్యర్థముగా "మా ♦ ప్రారబ్ధంబని"
భయపడుదుర! సం ♦ శయ పడియుందుర?

పాత పురాణమె ♦ వల్లించెదరా?
నేఁటికి రారా! ♦ నెరిపడి పోదుర?
నేఁటికి నింకా ♦ నిద్రించెదరా?
శుభాంత నాటక ♦ సూత్రధారులై
సచ్ఛీల మనో ♦ సంపాదకులై

దేశభక్తి సం ♦ దేశ దూతలై
భారతాభ్యుదయ ♦ పాత్రధారులై
నిష్కళంకులై ♦ నిరభి మానులై
మాతృదేశ స ♦ న్మాన సభ్యులై
విద్యలెల్లఁ గని ♦ పెంచిన వారై

యెటుఁ జూచిన మీ ♦ రే పెన్నిధులై
భారత భాగ్య ♦ ప్రాణ ధనికులన
నడవండీ యీ ♦ నవ భారతమును

నిలుపండీ మీ ♦ నిరుపమ మమతను
జూపండీ యీ ♦ సురుచిర సీమను

బలపఱచండీ ♦ బలభీముఁలో యన
యుండండీ మీ ♦ రుత్సాహమ్మున
నడవండీ స ♦ న్మాన స్థలమును
పొందఁడీ మీ ♦ పూర్వ విజయమునుఁ
జూపిన ఫలితమును ♦ జూచుకొనండీ

మాలలనంగ స ♦ మాన స్కంధులు
మాతృదేశ సుమ ♦ మాల సమానులు
మాతృదేశ పర ♦ మ ప్రియభక్తులు
మాతృదేశ సుఖ ♦ మార స్వాములు
మాతృదేశ సీ ♦ మావన దక్షులు

కారా! మీరలు ♦ కాలక్రమమును
కనులు దెఱవరా! ♦ కష్ట పడెదరా!
మనుజులు కారా! ♦ మానవ హక్కులు
కనుఁగొన లేరా? ♦ కావల దనెదర!
వారె యిత్తురని ♦ యూరకుందురా?

భారత దేశ సు ♦ భద్ర చంద్రమకుఁ
పంచ ప్రాణా ♦ ర్పణ జేయండీ!
బలి దానమునకు ♦ భయపడ కండీ!
పరాయిల వలలోఁ ♦ బడఁ బోకండీ.
మురిపించిన నే ♦ పొరపడకండీ

పరమత మెంతో ♦ భయావహ మండీ
తెలుకొండ్ల నటఁ ♦ దెలిసి కొనండీ
అగ్రిజు లింటి స♦హాయ సంపదయి
కుడి భుజములుగాఁ ♦ గూడు కొనండీ
సద్భావ ఫలముఁ ♦ జవి చూడండీ

అనారోగ్యకర ♦ మగు మద మాంసము
మిము ముంచిన దని ♦ గమనించెదరా?
నవ్య యుగంబున ♦ నవ్వఁబడెదరా!
ముందుకు రారా! ♦ మూగ లయెదరా!
ఎవరికి వారే ♦ యమునా తీరే
యని యనుకొని మీ ♦ రడుగంటెదరా?
కూలఁ బడిననో ♦ చాలదనెదరా
అనుకూల స్థితు ♦ లను వలదందుర?
కనులు దెఱవరా ♦ కాళ్ళాడించర?
బడియున్ననోట ♦ బందెయనెదరా!

చదువు సంధ్యలన ♦ చాల్చాలందుర?
మీకై మీరే ♦ మిగిలి యుందురా!
మీబాగోగులు ♦ మీకెఱుంగరా!
నేఁటికి నింకా ♦ నిద్రించెదరా!
కనుఁగొనరా! నిం ♦ కా మీలోపము
తెలియ వలదె? మా ♦ లిన్య కారణముఁ
గడుగుకొనర? యిం ♦ కా మీనైల్యము
వెదకి తీయరా?♦ విద్యా లేశము

బోవలదా? ము ♦ న్ముందులు మీరే
గిట్టుబెట్టుకొని ♦ కట్టుదిట్టమని
పలకఁ బట్టుకొని ♦ జలపము చేఁగొని
మొట్టమొదటనో ♦ బొట్టుఁ బెట్టుకొని
స్వచ్ఛమైన ఓ ♦ బట్టఁగట్టుకొని
సంఘములోనో ♦ చట్టబద్ధమయి
కొట్ట కొసకుఁ బో ♦ కుండ కులాసగ

ఎట్టయెదుట రాఁ ♦ బట్టిన వారనఁ
బేరూరును నిలఁ ♦ బెట్టిన వారన
స్వచ్ఛమైన సం ♦ స్థానికు లోయన
దుష్టాభ్యాసముఁ ♦ ద్రోసిన వారన
స్వాభిమాన సం ♦ స్థాపకు లోయన

నవభారత నవ ♦ నాగరు లోయన
"వాహావాహా" వీ ♦ రే హైందవులన
ఆర్యులు వీరే ♦ యనఁదగు వారన
మమ్మాటికి మును ♦ ముందుకు రండీ
అగ్రజులింతే ♦ యనుకొనకండీ

కరచాలనముకు ♦ కరమెత్తండీ!
"అభాగ్యులమ్మ"ని ♦ యనుకొనకండీ!
"ప్రారబ్ధంబ"ని ♦ పరుగిడకండీ
గట్టి గుండెలై ♦ గర్వించండీ?
భారతీయులై ♦ బాహాబలులై
వీర జాతులై ♦ విద్యానిధులై

సభ్య జాతియై ♦ శాంత ముద్రితై
మకరపు పట్టై ♦ మాన్యధనికులై
సరిసమానులై ♦ సాధుజీవులై
రండి భయపడ ♦ కండి! రండి!
శుభమే జరుగును ♦ చూచు కొనండి
మాలలార! యిక ♦ మము నమ్మండి!
చక్కని రెట్టలు ♦ చల్లగుండగా
యావజ్జన సౌ ♦ హార్దముండగా
కావలసిన సౌ♦ కార్యాలుండగ
శాసనమే మిము ♦ సహకరింపగా
మాలకులమ! ♦ ముమ్మాటికి నీవే
ఆర్థిక దైన్యం ♦ బని ప్రశ్నింతువ?
యిక ఎటులని చిం♦ తించుచుందువా!
ఆరోగ్యమె ద్ర ♦ వ్యంబని దలచవ?
బాహు బలము ద్ర ♦ వ్యంబని దలచవ!
నీబాగోగులు ♦ నీవెఱుంగవా?
ఉన్న వానినే ♦ యుపయోగించవ?
లేని దాన్నికై లేదని ♦ వగతువ?
కలిగిన కలిమిని ♦ వలదని మురుతువ!
గులుగుదువా? సం ♦ కోచపడుదువా?
ఉఱికిన పశుకా ♦ పరులు తొందరగ
పొద్దుపోవునని ♦ పొరబడు చుందుర!
మాలలార! యిక ♦ మేలుకొనండీ
మిత్రులార యిక ♦ మేలుగొనండీ!

సమాప్తము.

# మంత్రకూటస్థకవి సహాయక సభ్యులు

1. శ్రీ యమ్. రాధాకిషన్‌రావుగారు, ప్రి. ఉపాధ్యాయులు.
2. శ్రీ సీ. సాంబయ్యగారు, సహాయక ,,
3. శ్రీ అబ్దుల్ రహీము ఫారుకీగారు ,, B. A. B. T.
4. శ్రీ వెంకన్నగారు. పేషకారు. B. A. తహ, కార్యాలయము
5. శ్రీ వెంకటరావుగారు ,,
6. శ్రీ రఘుపతిరావుగారు ,,
7. శ్రీ రాజేశ్వరరావుగారు ,,
8. శ్రీ వెంకటరాజన్న అవధానిగారు, వకీలు.
9. శ్రీ చిన్నరాజేశ్వరరావుగారు ,,
10. శ్రీ పీ. హనుమంతురావుగారు ,,
11. శ్రీ గణపతిరావుగారు ,,
12. శ్రీ యమ్. నారాయణరెడ్డిగారు, దుద్దెనపల్లి.
13. శ్రీ యస్. రాజలింగంగారు, P. W. D. శాఖవారు.
14. శ్రీ యస్. చంద్రయ్యగారు కంట్రాక్టరు. P. W. D.
15. శ్రీ దొంతుల రాజలింగంగారు, శాహు.
16. శ్రీ సువర్ణ చంటయ్యగారు
17. శ్రీ కొమరవెల్లి మహాదేవుగారు, శాహు.
18. శ్రీ సువర్ణ కొండయ్యగారు
19. శ్రీ కర్ణె పుల్లయ్యగారు
20. శ్రీ కే. సీతారామారావుగారు, A. F. A.
21. శ్రీ వీరారెడ్డిగారు, జూలవెల్లి
22. శ్రీ కొత్తపల్లి వీరేశముగారు, శాహు.